


## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్ ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.
సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ-

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

**సాలోఫేన్**
అమోఘమగు
సహాయకరమైన
నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL

మారుతీ ప్రొడక్షన్స్

# రాజా

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత
ఎ. లక్ష్మీకుమార్ B.A.

దర్శకత్వం
కె. రాఘవేంద్రరావు B.A.

సంగీతం: చక్రవర్తి  డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ: వి.యస్.ఆర్. స్వామి W.I.C.A.

లక్ష్మీ ఫిలింస్

LAKSHMI PUBS

# లోకంపోకడ

పారిస్‌లో ధనిక బీద దేశాల సమావేశం ఆపివేత!

నాకు తీరే వరకూ నువ్వలాగే వేచి ఉండాలి!

ధనిక దేశాలు

బీద దేశాలు

కాంగ్రెస్‌లో మన పలుకుబడిని పోగొట్టుకున్నాం! అయినా నిస్పృహ చెందవద్దు. యువజన కాంగ్రెస్‌లో చొరబడటానికి ప్రయత్నం చేద్దాం!

తుఫానువల్ల రు. 224 కోట్లు నష్టం!

ఆం.ప్ర

రక్షించండి! రక్షించండి!

కాపాడండి!

ఇసుకలో భవనాలు కట్టినవాళ్లు

అస్థిరమైన పార్టీ మద్దతు

చాలీ చాలని పార్టీ మద్దతు


## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938–1972]

శుక్రవారం : 24–12–'76

నలనామ సం. పుష్య శు. చవితి

*సంపుటము 70 : సంచిక :17*

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

*

పోస్ట్‌లో ఏడాది చందా రు. 41–60

" ఆరుమాసాల చందా రు. 20–80

విడి ప్రతి వెల 75 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయసూచిక



పద్మశ్రీ, నటరత్న యన్.టి. రామారావు సమర్పించు,
శ్రీరామకృష్ణ చిత్ర వారి

# మంచికి మారుపేరు

ఈస్ట్‌మన్ కలర్

ర్శకత్వం: సి.యస్.రావు బి.ఎ.(ఆ) నిర్మాత: యం. మనోహర్ ఎం.ఎ.

















### ముఖచిత్రం

మురళీమోహన్ జయచిత్రల ముఖచిత్రం ఆంధ్ర పత్రికకు అత్యంత రమణీయతను చేకూర్చింది. "కిటికీ కావాక్షి" చదువుతుంటే నాలుగైదు పాత కథలు ఓ సినిమాకథ కూడా గుర్తొచ్చాయి. నల్ల గులాబీ కూడా పాతకథే. "వ్యక్తిత్వం లేని వ్యక్తి, డాక్టర్ వనిత" ముందేం జరుగుతాందో నన్న ఉత్కంఠను కల్గిస్తున్నాయి. కథలకన్నా మిగిలిన వ్యాసావళులు రచనలే పాఠకులను ఆకట్టుకుంటున్నాయి. వీరాజీగారి "సామాన్యుడి సణుగుడు" శీర్షిక చాలా బాగుంది.

జి. యోగీశ్వరరావు, (హైదరాబాదు)

### సీరియల్

నా అభిమాన నటి వాణిశ్రీ ముఖచిత్రంతో వెలువడిన పత్రిక నాకెంతగానో నచ్చింది. ఈ వారం పత్రికకే హైలైట్‌గా వుంది. "డాక్టర్ వనిత" సీరియల్ అత్యంత ఆసక్తిదాయకంగా ఉంటున్నది. రాగతి పండరిగారి జోక్స్ బాగున్నాయి. ఈ నాటి పత్రిక (19.11.76) ముఖ చిత్రం కూడా ఎంతో అందముగా ఉంది. కిటికీ కావాక్షి నల్లగులాబీ కథలు ఫరవాలేదు. ముఖచిత్రంలో మీరు తీసుకుంటున్న శ్రద్ధకు నా అభినందనలు. మా(మీ) ఆంధ్రసచిత్ర వారపత్రిక ఎప్పుడూ మంచి సీరియల్స్, కథలతో మాకు ఉత్సాహాన్ని కలిగిస్తూ వుండాలని కోరుకుంటున్నాను.

ఎ. శ్రీవల్లి, (నెల్లూరు).

### కథలు

12.11.76 వ సంచికలోని రెండు కథలు బాగున్నవి. "రాణీ నా మా"ను రచయిత వాస్తవంగా తీర్చి దిద్దారు. ఉప్పులూరి ఉమాదేవి గారి కథకు కేతిసీడు, చిత్రీకరణలో బాపూనమూనా ఇచ్చి ఆకట్టుకొనేలాగా అందంగా చిత్రించారు.

వి. దయానందం. (కాగజ్‌నగర్)

* * *

"నల్లగులాబి" కథ ఆణిముత్యం. "కిటికీకావాక్షి" బాగుంది. కవితలు ఎక్కువ సంఖ్యలో వేయండి. సురేశ్ జనగామ నుండి వ్రాసిన లేఖపై అందునా సినీనటులపై అంతగా విమర్శించి వాదన పెంచుకోవడం తప్ప విజ్ఞానం ఏ మాత్రం చేకూరుతుందో తెలియడం లేదు.

కె. వై. గిరి (ఆకారం గ్రామం) సిద్దిపేట తాలూకా.

(46వ పేజీ చూడండి)

## మనలో మాట

### అందరికీ మా క్రిస్మస్ శుభాకాంక్షలు!

దీపావళి కథల పోటీకి వచ్చిన కథలలో కొన్ని కథలను మామూలు ప్రచురణకు ఎన్నిక చేసుకున్నాము. ఆ విషయం ఆయా రచయితలకు తెలియజేశాము కూడాను ... దీపావళి పోటీకి పంపబడ్డ కథలు యెట్టి పరిస్థితులలోను త్రిప్పి పంపడం సాధ్యంకాదు కనుక— తతిమ్మా కథకులంతా ఈ విషయాన్ని గుర్తించి-వాటిని త్రిప్పి పంపమంటూ ఉత్తరాలు వ్రాయవద్దని మనవి చేస్తున్నాము. ఆంధ్ర సచిత్ర వారపత్రికకు రచనలు పంపే రచయితలు యితర పత్రికల నుంచి తస్కరించిన రచనలు పంపకూడదని వేరే చెప్పనక్కరలేదు కాని—"మేము పంపిన రచన పడ్డ ఆ పత్రిక ఎవరూ చూడలేదులే" అనుకొని కొందరు మాకు కొన్ని కథలు సొంతంగా రాశామన్న హామీతో పంపేస్తూంటారు, కాని ఆంధ్రసచిత్ర వారపత్రికను చాలా మంది చదువుతారు కనుక అటువంటి రచన అచ్చుపడగానే యిటువంటి దొంగతనాలు సులువుగా దొరికి పోతూంటాయి. పాఠకులు వేయికళ్లతో వెతికి నిజాన్ని సంపాదక లేఖల ద్వారా వెల్లడి చేస్తుంటారన్న సంగతి వర్తమాన రచయితలు గుర్తించాలని మనవి... ★

## 20 ఏళ్లలో 80 శాతం

1956 లో ఆంధ్రప్రదేశ్‌లో రూపొందిన రోడ్డు రవాణా సంస్థలో యీనాడు నాలుగు వేల మూడు వందల నలభై మూడు బస్సులు రోజుకు దాదాపు యిరవై లక్షల మంది ప్రయాణీకులను తమ తమ గమ్యస్థానాలకు తీసుకు వెళ్ళడం, గమ్య స్థానాలను నుంచి తీసుకు వెళ్లడం చేస్తున్నాయట. ఈ ప్రభుత్వ రోడ్డు రవాణా సంస్థ యీ నాడు ఏడు వేల రెండొందల అరవై అయిదున్నర లక్షల రూపాయలు ఏటికి ఆర్జిస్తోందట. అంతేగాక సాలీనా ప్రయాణీకుల సౌకర్యాల కోసం దాదాపు అరవై ఎనిమిది లక్షల ఖర్చు చేస్తోందట. మన రాష్ట్ర వైశాల్యంలో సుమారు ఎనభై శాతం మేర రోడ్డు రవాణా జాతీయం చేయబడినదట. ఈ సంస్థలో 37,863 మంది పని చేస్తున్నారట. చక్కని సాధింపు. కానీ మా తెలుగు తల్లి పాటలో శ్రీకృష్ణ దేవరాయల్ని చేర్చేసుకున్నామేమిటి? ఆయన తుళు (కన్నడ) వంశస్తుడని కదా కొత్తాంధ్రవాచకంలో చదివిన గుర్తు! కాదా!!

## ట్యూబెక్టమీలో కొత్త పద్ధతి

బెల్జియంలో కుటుంబ నియంత్రణ ఆపరేషను స్త్రీలకు చేయడంలో కొత్త మార్గం కనిపెట్టారట. ఈ పద్ధతి ద్వారా పిల్లలు వద్దనుకుని ఆపరేషను చేయించుకుని, అవసరమనుకుంటే మళ్లీ యింకో ఆపరేషను చేయించుకోవచ్చట. కానీ ప్రస్తుతపు ట్యూబెక్టమీ ఆపరేషనుతో సంతానోత్పాదక శక్తి శాశ్వతంగా పోతున్నది కదా! దీని మీదదే బెటరేమో!

### ఉస్మానియా ఉపాధ్యాయుని విస్మయం!

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో అధ్యాపకులు టైముకు రానే రావటం లేదట. అందులో కొందరు వేరే పని లేక, బొత్తిగా తోచకపోతే "పోన్లే" అని విశ్వవిద్యాలయానికి వస్తున్నారట. అధ్యాపకులే గాక ఆఫీసుకు చెందిన సూపరింటెండెంటువంటి



తదితర ఉద్యోగులకూ అంతేనట. వైస్ఛాన్సలర్ గారు వున్నట్టుండో రోజు పదకొండింటికి ఆఫీసంతా తిరిగితే ఆల్మోస్ట్ అన్ని కుర్చీలు ఖాళీయేనట. అట్టెండెన్సు చూస్తే తెలతెలబోతోందట. ఇవాలా అయితే కుదరదనీ, వార్నింగివ్వాలనీ వారికని ఆయనన్నారట.

### పిల్లలుపుట్టే మందిస్తానని నగలు అపహరించిన నయవంచకుడు

వరంగల్లు జిల్లా తండపల్లి అనే వూరికి చెందిన గద్దె నరసయ్య అనే ఆయన భార్య వజ్రమ్మను ఓ వ్యక్తి నమ్మించి ఆమెను, ఆమె భర్తను, అత్తగారిని వూరు చివరనున్న ఓ గుడికితీసుకు పోయి అక్కడ వజ్రమ్మకు పిల్లలు పుట్టే మందిదిగో మీ ముగ్గురూ తీసుకోవాలని చెప్పి యిచ్చాడట. పిల్లలు పుట్టే మందిస్తానన్నందుకే అతని కాళ్ల పడ్డ ఆ ముగ్గురూ ఆ మందు తిని స్పృహకోల్పోతే ఆ దుర్మార్గుడు వారి వంటి మీదున్న నగానట్రా ఒలుచుకు చక్కాపోయాడట.

### చోద్యంకాదు...ఉత్తర్వు

పన్నెండేళ్ల క్రితం వుద్యోగంలో రిటైరైన ఓ సెషన్సు జడ్జిగారికి "అయ్యా తమ ఉద్యోగం 1958 డిసెంబరు తొమ్మిదో తేదీనుంచి ఖాయపరచడమైనది" అనటాని బొంబాయి హైకోర్టు నుంచో వర్తమానం వచ్చిందట. చోద్యం కాదు, వర్తమానం. . ఉత్తర్వు. . నో. . చోద్యం. .

### రాక్షసిచీమల సాహసం!

బ్రెజిలు నుంచి పెద్ద గండు చీమలను మించి రాక్షస సైజు చీమలు పరానా నదిని యీదుకుంటూ దాటి బయాగొరా నగరం చేరాయట. ఆ నది దాటాకున్న ఓ పడిపోయిన చెట్టు మీదా రాక్షసి చీమలు రెస్టు తీసుకుంటుండగా అక్కడి ప్రభుత్వం కంటబడ్డాయట. ఈ చీమలు మన మామూలు గండు చీమలకు నాలుగు రెట్లు ఎక్కువగా అదే రూపురేఖలతో వున్నాయట. హార్నీ!

### ఊటీలో యుడెకోలోన్ పిపాసులు!

వూటీలో మద్యపాన నిషేధం అమలులోవున్నందువల్ల అక్కడ మరే పద్ధతితోనూ, యుక్తితోనూ మద్యం పొందలేక పోవడం వల్ల ఆ మద్యంమీది మోహం, వ్యామోహం, వ్యసనం మాను లేనందువల్ల అక్కడి కొందరు యుడెకోలోన్ (సౌందర్య పోషణ ద్రవ్యాలలో ఒకటి) తాగేస్తున్నారట గట గట! వార్నీ!

### కారుకన్న నౌకరే ఖరీదు

టెక్సాస్‌లో తమ కారును తానే కడుక్కుని తానే శుభ్రం చేసుకునేది కేవలం బీదవాడేనట. అసలు ధనికులు తమ కార్లను నౌకర్లతో శుభ్రం చేయించుకుంటారట. దీనిబట్టి అక్కడ సాధారణ బీదవాడికో కారు తప్పనిసరిగా వుంటుందని, ఎటొచ్చీ ఆ కారుని భరించటం కన్నా అదికడిగేశుభ్రం చేసే నౌకరును భరించడమే ఎక్కువ ఖరీదనీకూడా తెలుస్తోంది.

### ట్రక్కు విలువ పది లక్షల డాలర్లు!

అమెరికాలో జనరల్ మోటార్సు కంపెనీ వారో ట్రక్కును తయారు చేశారట. దీనింజను మూడు వేల అశ్వశక్తి (హార్స్‌పవర్) కలదట. మొత్తం ట్రక్కు బరువు ఐదులక్షల పౌనులట. బోయింగ్ 747 కన్నా ఓ లక్ష పౌనులు బరువీ ట్రక్కే ఎక్కువన్న మాట. ఈ ట్రక్కు 67 అడుగుల పొడవు, 25 అడుగులు వెడల్పువుందట. వెల పది లక్షల డాలర్లట. ●



# కళ్లజోడు లేకుండ మీరు కంటి చూపు పొందగలరు!



మీకు ఇంతకన్న ఎక్కువ ఆనందాన్నిచ్చేవార్త మరొకటి ఉంటుందా!

## 'కాంటాక్ట్ లెన్స్' లను వాడండి

ఈ 'కాంటాక్ట్ లెన్స్' లు హ్రస్వదృష్టి, దూరదృష్టి మరియు అఫాకీ (కాటరాక్టు ఆపరేషను పిమ్మట), కెరాటోకోనస్, అనిసోమెట్రోపియా, అనిరిడియా, ఫొటోఫోబియా మొదలైన దృష్టిదోషములు కలవారికి ఉత్తమమైనవి.

'కాంటాక్ట్ లెన్స్' లను మీ కంటి పాపలకు మీకుమీరే అనుకూలంగా పెట్టుకొనవచ్చును... తీసివేసికొనవచ్చును – కొద్దిదినముల అభ్యాసంతో. మీ కళ్లకు పెట్టుకొన్న చిన్న 'కాంటాక్ట్ లెన్స్' లు ఇతరులకు అగుపించవు. కనుక మీ సుందర ముఖంలో ఏ మార్పును ఉండదు.

మీ కంటి వైద్యుని
సంప్రదించండి

ఇతర వివరములకు:

**ఆసియా కాంటాక్ట్ లెన్స్ లేబొరేటరీ**
4/1, ఆండర్సన్ రోడ్,
మద్రాసు-600 006

ఫోన్:
87868




# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి.. రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించునదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంత క్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ ప్రకటించబడనట్టు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటే: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి.

ఎంతో చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్లు తోముకొనుటను పిల్లలు ఇష్టపడతారు!




శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...కాల్గేట్ కొనండి



కాకినాడ రాజా చంద్రసాగరంలో వరదపాలైన కోసిన పంటలు

# "ఈనగాచిన పంట గాలివానపాలు"

'అనావృష్టి, అనావృష్టి' అంటూ గోల పెడుతున్న తరుణంలో జనాల మీద వరుణదేవుడు కరుణించకపోగా, పండిన పంట కోసుకుందామనుకున్న సమయంలో మూతి మీద కొట్టి నోటి ముద్ద లాక్కున్నట్లు, గాలి వానమీద గాలివానమీద గాలివానగా ముమ్మారు అతివృష్టిని కురిపించి వాగులు వంకలూ ఏకంచేసి ఏరూ నేలా 'మమేకం' చేసేశాడు!

'నా పూర్వోన్నో యింత మునిగింది మా తాలూకాలో యింత పోయింది!' అని గోల గగ్గోలుగా తయారైంది దక్షిణాది ధాన్యాగారమైన కోస్తా ఆంధ్రా అంతా! ఇక్కడ కృష్ణా, గోదావరీ నదీమతల్లుల ముద్దు బిడ్డల గోడు ఇలా వుండగా, నెల్లూరు జిల్లా వాసుల 'కడుపు శోకం' ఇంకా హృదయ విదారకంగా వినపడుతున్నది...అధికారికంగా అందిన సమాచారం ప్రకారమే 53 మంది యీ తుఫాన్ రక్కసికి బలి అయిపోయారు. అక్కడ!...

30 లక్షల ఎకరాలకు ముంపు అన్న అంచనా వచ్చింది ఇది ఎన్ని లక్షల కుటుంబాలకు దుఃఖ కారణమో వూహించడం కష్టమేం కాదు...

ఇదంతా యిలా వుండగా-పొలాల్లో నీళ్ళు మోకాలిలోతునికి వినియోగించే పంపు సెట్లను

# సామాన్యుని సణుగుడు

నీట మునిగి ఏడేల నుంచి నీరు లోడి పోసికింది వాడుతున్న రైతులు-కన్నీరుకార్చగల ధైర్యం, బలం లేక ప్రభుత్వంకేసి – బహుదీనంగా చూస్తున్నారు... 'ప్రభుత్వమూ త్వరితంగా కదుల్తోంది.'

రాష్ట్ర ముఖ్యమంత్రి నవంబర్ 30 న హైదరాబాద్‌లో 'కేంద్రం నుంచి కూడా పెద్ద ఎత్తున సహాయం సంపాదించటానికి ప్రయత్నం చేస్తున్నాను'ని చెప్పారు.

ఈ పాటికే క్వింటాల్ కి యిరవై రూపాయల దాకా బియ్యం ధర పెరిగి పోయిందన్న ఆందోళనను విలేఖరులు ముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకొచ్చారు. 'ఇది తుఫాన్ కారణంగా కాదు... దక్షిణ మండలం ఏర్పాటు కారణంగా జరిగిందని–యీ ప్రకృతి వైపరీత్యంవల్ల ధరలు పెరగకుండా నొక్కివుంచే ప్రయత్నం చేస్తామని – బియ్యం లోటు యేర్పడ్డ ప్రాంతానికి అదనపు సరుకుని హుటాహుటీ త్రోలుతామని ఆయన అన్నట్లు దినపత్రికల్లో చదువుకున్న సామాన్య జనం–కొంతలో కొంత ఉపశమనం చెందుతున్నారు.

## వ్యాపారస్థులకు త్యాగ పరీక్ష

తుఫాన్ రైళ్ళను ఆపేసింది. బస్సులను దిగ్బంధం చేసింది... టెలిఫోన్ టెలిగ్రాఫ్ తీగెలను పూపి పూపి తెంపేసింది...రవాణా మీద- రాకపోకల మీద కర్రా గట్టిదెబ్బ కొట్టింది. ఇదంతా 'బిజినెస్ లాసే'. ఐదు రోజులు సూర్యోదయాన్ని ఆపిన యీ గాలివాన ఉధృతి మన రాష్ట్రంలో ఆర్థిక



నెల్లూరు పట్టణంలోని రూరలవాని మిట్టలో పెన్నా నదినుండి నీళ్ళు ప్రవహించుతున్న దృశ్యం

## కోడ్ బేళె

కావలసిన వస్తువులు :

బియ్యప్పిండి-రెండున్నర కప్పులు, కొబ్బరి కోరు-ఒక కప్పు, వెన్నపూస-100 గ్రాములు, నూనె-పావుకిలో, తగినంత కారం, ఉప్పు.

ముందుగా కొబ్బరికోరు, బియ్యప్పిండి, వెన్నపూసలలో కారం, ఉప్పు కలిపి ఇంగువ కరగ బెట్టిన నీళ్లు చల్లి పూరీలపిండిలా గట్టిగా చేసుకోవాలి. ఈ పిండిని చిన్న చిన్న ముద్దలు తీసుకుని చేగోడీలవలె చుట్టుకోవాలి. బాణలిలో కాగుతున్న నూనెలో సన్న సెగను ఈ చేగోడీలను వేయించుకోవాలి.

— వి. అరుంధతీరావు.

## సామాన్యుని సణుగుడు

స్థితిమీద వెన్నుపోటు పొడిచింది... అనుమానం లేదు.

ఇదంతా జరిగాక మామూలు మనుష్యులు జీతాలమీద బ్రతికే వాళ్లు— ధరల గురించి ఆందోళన చెందే తరుణమే యిది మరి...'అయ్యో అమ్మో' అంటూ గుండెలు కొట్టుకుంటున్నాయి. అందుకే యిలాంటి ప్రకృతి బీభత్స సమయాల్లో జనాన్ని ఆదుకొనే అవసరం గవర్నమెంటు వారి కెంత వుందో, వ్యాపారస్థులకీ, ప్రభుత్వ ఉద్యోగులకీ కూడా అంతే వుంది...వ్యాపారస్థులు 'దాచి దాచి తుదకు దొంగలకిస్తారో దొరలకిస్తారోనన్న' ఫిలాసఫీ పెంచాలి...రైతుకి వచ్చిన ఈ నష్టం 'తానుగాని వానపాలు చేసిన పంట' మీద దుఃఖం ఎంత అపారమైనదో వ్యాపారస్థుల మీద వద్ద 'త్యాగభారం' కూడా ఉన్నదంత అధికమైంది... అవి వాళ్ళు గుర్తించి 'లాభాల'ను లెక్క పెట్టుకోకుండా ధరలు 'మూలిగే నక్కమీద' తాటిపండు చందాన పడకుండా జనాన్ని కాపాడాలి. ఇది చట్టం ద్వారా కన్నా హృదయ పరివర్తన ద్వారా ఎక్కువ సాధ్యం కనుక మాలాంటి సామాన్యులం చేసే జనరల్ అప్పీలు ప్రస్తుతానికదే... రైతుకి ప్రభుత్వ సాయంతో పాటు మన సానుభూతి ఎలాగ వుంటుంది...మన మీద వ్యాపారస్థులకి సానుభూతి ఎంతవరకు వుంటుందో వేచి చూద్దాం.

— పిరాజీ ★




ఆ తెల్లవారుఝామునే 'టూరు' నుంచి రైలు దిగి ఇంటికి వచ్చాడు మూర్తి. ముందు వరండాలో చీకటిగా వుంది. ఆ వరండాలో మంచంమీద పడుకుని వున్న వేణమ్మ లేచి కూర్చుని అడిగింది 'ఎవరూ?'

'నేనేనమ్మా.' అంటు వెళ్ళి మంచం పట్టెమీద కూర్చుని ఆప్యాయంగా ముంగురులు సవరిస్తూ 'ఇప్పుడు నీ వంట్లో ఎలాగ వుందమ్మా' అని అడిగాడు మూర్తి.

'బాగానే వుంది బాబూ. కానీ నీరసం తగ్గలేదు' అంది వేణమ్మ; కళ్లల్లో నీరూరగా. 'సర్లేమ్మా. రేపు ప్రొద్దుటే డాక్టర్ దగ్గరకి వెళ్ళి చూపించి టానిక్కులు తెస్తానుఏం?'అన్నాడు మూర్తి ఆప్యాయంగా.

'నీ వంట్లో బాగానే వుందా అమ్మా, ఈ రెండు రోజులు కోడలు జాగ్రత్తగా చూసుకుంటు వుందిగా?' అన్నాడు మూర్తి.

'ఆఁ. నా కోడలుకేం? బంగారు తల్లిరా' అంది సంబరంగా వేణమ్మ. ఆమె కళ్ళు మెరిసేయి.

'సర్లే. పడుకో. చలిగా వుంది' అంటు దుప్పటి కప్పాడు మూర్తి మాతృమూర్తికి ప్రేమగా.

చిరుచలిగా వుంది. సన్నగా గాలి వీస్తూ వుంది. ప్రశాంతంగా వుంది. వీధి తలుపు వేసి వుంది. వెనక వరండాలో లైటు వెలుగుతూ వున్నట్టూ, అక్కడ్నించి గుసగుసగా ఏవో మాటలు వస్తున్నట్టు అన్పించింది మూర్తికి.

ప్రక్క సందునించి అటు వయిపుగా నెళ్ళాడు మూర్తి పిల్లిలాగ.

అవును. వెనక వరండాలో లైటు వెలుగుతూ వుంది.

డైనింగ్ టేబులు ముందు ఇద్దరు వ్యక్తులు కూర్చుని వేడివేడి కాఫీ చప్పరిస్తూ మాట్లాడుకుంటున్నారు. అందులో ఒకవ్యక్తి సులోచన. రెండో వ్యక్తి పురుషుడు!

ఆ పురుషుడు అడిగాడు 'మీ అత్తగారు మంచిదేనా?'

సులోచన అంది. 'మంచిదే. కాని జబ్బు మనిషి. సేవలు చేయలేక చచ్చిపోతున్నాను. మా ఆయనది మొండి పట్టు. ఎప్పుడూ

'అమ్మా అమ్మా' అంటూ ఒకటే పారాయణ. ఒకటే సేవలు. అలాగే నన్నూ ఆవిడకి సేవలు చేయమంటారు. ముద్దూ ముచ్చటా లేదు ఒక సినిమా లేదు సర్దా లేదు పాత కాలం మనిషి.'

'ఆవిడ ఆ వూళ్లో కూతురు దగ్గర వుండేదిగా?'

'అవును. ఈయనే వెళ్లి తీసుకుని వచ్చారు జబ్బు పడిందని వుత్తరం రావటం ఈయన పరిగెత్తి వెళ్లి ఆవిడ్ని తీసుకొచ్చి నా నెత్తిన పెట్టటం జరిగాయి! ఓపిక కయినా ఓ హద్దు ఉండద్దూ?'

'ఇప్పుడెలాగ వుంది ఆవిడకి.'

'తగ్గిందిలే ఆ మధ్యన మా ఆడబిడ్డ వుత్తరం రాసింది. అమ్మని పంపించమని. వెంటనే పంపినా బావుండును. ఈయన చాదస్తం. ఆవిడ్ని తెచ్చి నా నెత్తిన పెట్టారు!'

'బావ ప్రేమగా చూసుకుంటాడా నిన్ను?'

'నిజం చెప్పాలంటే ఆయన దేవుడు. అంత మంచి మనిషి దొరకడు. కాని ఈవిడ వచ్చినప్పట్నుంచి మనిషి మారిపోయారు. ఎంతసేపూ 'తల్లి' నామస్మరణే. పిచ్చిగాదూ'

'ఏం? మరి కూతురు దగ్గరకి వెళ్లదా? మీ ఆడబిడ్డకు కూడా పిచ్చి బాగానే వున్నట్లుందిగా?'

'అవును. ఆవిడ మరల నిన్న వుత్తరం రాసింది. 'అమ్మని పంపించు' అని. ఈయన మా అత్తని త్వరలోనే తీసికెళ్లి దిగపెట్టి రావచ్చు. అప్పుడుగాని నా గుండె బరువు దిగదు' నిట్టూర్చింది.

'పోనీ. ఈ నాల్గు రోజులు మంచిగా ఉండరాదా? ఎట్లాగూ పోయేదేగా?'

సులోచన నవ్వింది. 'ఆ సంగతి నాకు తెలీదా?'

'అన్నట్టు అమ్మ నిన్ను చూడాలని కలవరిస్తోందే వస్తానా?'

'ఇప్పుడు కాదులే. అమ్మ బాగా తిరుగుతూ వుందిరా?'

'ఆఁ అదే తిరగటంలేదే?'

'ఒరే అన్నాయ్ అమ్మని కాస్త కనిపెట్టి వుండు. జాగ్రత్తగా చూసుకో. వదిన చెంగు పట్టుకుని తిరుగుతూ అమ్మని మర్చిపోయేవు? తల్లి అంటే దైవమురా. తల్లి ఋణం ఎంత తీర్చుకుందామన్నా తీరేది గాదు. ఈ వయసులో ఆవిడ్ని పువ్వులగ చూసుకోవాలి.'

'నాకు తెల్సులేవే' నవ్వాడు అతను.

కాసేపు నిశ్శబ్దం. పైకా ప్యాయత వర్షిస్తూ వుండే సులోచన మనసులో తన తల్లిమీద ఇంత దుగ్ధ వుందా?!! మూర్తి మనసు బరువుగా అయింది. గుండె ఆలోచనతో కొట్టుమిట్టాడింది

'మరి నేను వస్తానే పండక్కి వచ్చి తీసుకెడ్తాలే బావ పర్మిషన్ ఇస్తాడా?'

సులోచన నవ్వింది. 'ఇవ్వకేం చేస్తార్లే' అంటూ పెదవి విరిచింది.

'సర్లే. వచ్చే గురువారం వస్తా. మరల పని వుందిలే. నువ్వూ తయారుగా వుండు. ఆయన్నుకూడా రమ్మని చెప్పి వప్పించు ఏం?'

'అలాగే.'

అతను లేచాడు.

'అన్నట్టు జయరాం! ఇది అమ్మకి! ఇవ్వు' అంటు చిన్న డబ్బా ఇచ్చింది అతనికి సులోచన.

'ఏమిటది?'

'సున్నుండలు' అమ్మకిష్టం. వదినకి తెలీకుండా ఇవ్వు. తెలిస్తే ఆవిడ చిందులు తొక్కవచ్చు.'

'మరి నే వస్తానూ రయిలుకి టయిమయింది.' అంటు లేచాడు జయరాం.

మూర్తి చెట్లచాటుకి తప్పుకున్నాడు.




జయరాం వెళ్ళిపోయాడు. సులోచన తలుపు వేసింది. మరి గంట తర్వాత సులోచన తలుపు తీసేసరికి మూర్తి వరండాలో కూర్చుని వేణమ్మతో కబుర్లు చెప్తున్నాడు. తెల్లవారింది.

'ఎప్పుడు వచ్చారు?' మోహనంగా నవ్వింది సులోచన.

'ఇప్పుడే' నవ్వాడు మూర్తి. 'రండి వేన్నీళ్లు పెట్టాను. స్నానం చేద్దురుగాని' అంటు లోపలికి నడిచింది. మరల ఆ రోజు హాస్పటల్లో చూపించి, వేణమ్మకి టానిక్కులు అవి కొని ఇచ్చాడు మూర్తి. మూర్తి అక్క పేరు శ్యామల. ఆమె నుంచి వచ్చిన వుత్తరం చూసుకున్నాడు. ఒక నిర్ణయానికి వచ్చాడు.

మూర్తి ఆ సాయంత్రమే సులోచన దగ్గర ఆ ప్రస్తావన లెచ్చాడు. 'అమ్మని అక్కదగ్గర దించి వస్తాను. ఇవాళే ప్రయాణం.'

'అదేమిటి?! అంత తొందరేముంది. ఇంకా కొన్నాళ్ళాగమని రాయండి' అంది.

'మనకి తొందర లేదుగాని అక్కాయికి తొందరవుంది. ఎవరి కన్నతల్లి గురించి వారికి ప్రేమవుండటం సహజంగదా. ఆడపిల్లలకి అది ఎక్కువ కూడా. కాదా?'

'భలేవారు. ఏం మాటలవి?!' అంటు కోప్పడింది సులోచన. ఆ సాయంత్రం అత్తగారు ప్రయాణమయినపుడు బజార్నుంచి పంచలు తెప్పించి వేణమ్మకి పెట్టి నమస్కారం చేసింది సులోచన. ఎంతో ఆనందపడిపోయి నోరారా దీవించింది వేణమ్మ. నవ్వు నాపుకున్నాడు మూర్తి.

పదిరోజుల తరువాత జయరాం వచ్చి సులోచనని పుట్టింటికి తీసుకు వెళ్ళాడు. మూర్తి వెళ్ళలేదు. పండక్కి మూర్తి శ్యామలగారి వూరు వెళ్ళాడు. శ్యామల భర్త సుందరం మంచి మనిషి. ఆ నాల్గురోజులు తల్లిదగ్గర గడిపాడు మూర్తి.

పండుగ తర్వాత తిరిగి వచ్చి చిటచిట్లాడింది సులోచన; మూర్తి అత్తవారింటికి రానందుకు 'అర్జంటు పన్లున్నాయ'ని చెప్పాడు. మూర్తి సినిమాలకి తీసుకెళ్ళాడు భార్యని. ఒకసారి పిక్నిక్కుకి వెళ్ళారు. చాల ఆనందంగా వుంది. హాయిగా వుంది సులోచనకి. తన భర్త ఎంత మంచివారు! ఎంత మార్పు వచ్చింది!! అనుకుని సంతోషపడింది సులోచన. నిజంగానే మూర్తి ఇటీ

# ఆమెకేం కావాలి?

బొమ్మదేవర నాగకుమారి

(గత సంచిక తరువాయి)

సంధ్య బిత్తరబిర్ర అతని కళ్ళ వంక ధైర్యం తెచ్చుకుంటూ చూసి, "ఎందు కంత కోపంగా చూస్తావు? ఉదయ్ ఎంత మంచి బట్టలు వేసుకుంటాడో చూడలేదూ! అసలు అతన్లోని ఆకర్షణంతా ఆ బట్టల వల్లే నేమోననిపించింది నాకు. సహజంగా ఎంతో బాగుండే నువ్వు ఆ నూలు బట్టల్లో కంటే టెరిలిన్ బట్టల్లో ఇంకా ఎంతో బాగుంటా వనిపించి కొనుక్కొచ్చాను. వచ్చే బుధవారం గీత పుట్టినరోజట. ఉదయ్ వాళ్ళు ద్రాక్ష తోటలకి పిక్‌నిక్ ప్రోగ్రాం వేసాడు. అప్పుడు వేసుకుంటే బాగుంటుంది. పైగా నాన్నగారు పోయాక నేను ఎవరి దగ్గరుంటే వాళ్ళకి రెండు వందల యాభై రూపాయలిచ్చుకోవాలి అని తీర్మానించిన వాడివి నా దగ్గర పైసా కూడా తీసుకోకుండా దాటవేస్తున్నావు. పోనీ డబ్బు తీసుకోకపోయినా ఫరవాలేదు. కనీసం నేను తెచ్చిన బట్టలైనా తీసుకోలేవా?" అభ్యర్థనగా అన్నది.

కాని ఆ అభ్యర్థన లక్ష్మణ్‌నేం చలింప జేయలేదు. "ఉదయ్‌తో నన్ను పోల్చకు సంధ్యా నేనంత గొప్పవాణ్ణి కాను. పోతే డబ్బు తీసుకోకపోవటానికి కారణం ఈ విధంగానైనా మామయ్య ఋణం కొంతలో కొంతైనా తీర్చుకోగలనేమోనని. అంత మాత్రం చేత నా బట్టలు ఎన్నిక చేసి తెచ్చుకొచ్చే అర్హతా, అధికారం నీకు లేవు."

"ఎందుకు లేవు? మన కిష్టమైన వాళ్ళని మనకి నచ్చిన విధంగా చూడాలనుకోవటం తప్పా?" సంధ్య ఎదురు ప్రశ్నవేసింది.

"ఇందులో తప్పొప్పుల ప్రసక్తి లేదు. పోతే, నా రూపు రేఖల గురించి పట్టించుకుని ప్రత్యేక శ్రద్ధ తీసుకునేటంత అధికారం, చనువూ 'నువ్వంటే నా ఇష్టం' అనే వాళ్ళకి కాదు జీవితాంతం 'నువ్వు నాకు కావాలి' అనగలిగే వాళ్ళకి మాత్రమే ఇవ్వగలనను కుంటున్నాను, సరే! ఇప్పుడొచ్చిన నష్టమేమీ లేదులే! మా ఆఫీసులో ఎవరికైనా ఆ బట్టల్ని ఇచ్చేస్తాను." లక్ష్మణ్ తనని తను శాంత పరుచుకోటానికి ప్రయత్నిస్తూ మరో గదిలోకి వెళ్ళిపోయాడు.

సంధ్య బొమ్మలా నిలబడిపోయింది.

ఆఫీస్‌లో ఇన్‌స్పెక్షన్ జరుగుతూండటం వల్ల గీత పుట్టిన రోజు నాడు అందరితో పాటూ ద్రాక్ష తోటలకి వెళ్ళలేక పోయాడు లక్ష్మణ్. ఈసారి ఉదయ్ ప్రయత్నించినా సెలవు దొరికేట్లు కనిపించలేదు. ఇన్‌స్పెక్షన్ రోజులు మరి!

"పోనీ మరోసారి అందరం కలసి వెళ్ళవచ్చు! ఈ రోజు ఫస్ట్ షోకి ఏదైనా మంచి పిక్చర్‌కి వెళ్దాం." అంటూ ఉదయ్ ప్రోగ్రాం మార్చబోయాడు కానీ లక్ష్మణ్ అందుకుససేమిరా ఒప్పుకోలేదు. తన వల్ల అందరూ పిక్‌నిక్ కాన్సిల్ చేసుకోవటం అతని కిష్టం లేక పోయింది. "మరోసారి అందరం కలసి వెళ్దాం. సంధ్యకి ఇలాటి పిక్‌నిక్ లంటే చాలాఇష్టం." అంటూ నచ్చ చెప్పాడు. నిజానికి లక్ష్మణ్ తప్పుదల వల్ల కదిలిందేగానీ సంధ్యకెందుకో పిక్‌నిక్ అంటే ఎప్పటంత ఆసక్తి కలగలేదు. అప్పటికే లక్ష్మణ్‌తో ప్రతి ఆదివారం ఎక్స్‌కర్షన్‌లా గండిపేట, గోల్కొండ, సాలార్‌జంగ్ మ్యూజియం లాటి ప్రదేశాలన్నీ చూసేసిందేమో అతను లేకుండా ఎక్కడికీ వెళ్ళాలనిపించలేదు. అయినా తప్పదు. గీత కూడా తను రావాలని పట్టుబడ్తోంది.

ఉదయ్ వెనకే నడుస్తూ కారు దగ్గరికి వెళ్తున్న సంధ్యని రెండు క్షణాల పాటూ రెప్ప వేయకుండా చూస్తూండి పోయాడు లక్ష్మణ్. చామన చాయగానే ఉన్నా ఖరీదైన బట్టల్లో తీవిగా ఉన్న ఉదయ్ ప్రక్కన పసుపుపచ్చ రంగు జార్జెట్ చీరలో అందంగా మెరిసిపోతున్న ఆమె, అతని హోదాకి తీసిపోయేట్లు ఏ మాత్రం లేదు. వాళ్ళిద్దర్నీ ఎందుకలా ఆ దృష్టితో చూసాడో ఒక నిమిషం అతనికే అర్థం కాలేదు కానీ ఆ వెంటనే 'అప్పుడు ఎందుకు చూడకూడదు! చాలాసార్లు సంధ్య లాంటి అమ్మాయి దొరికితే వదులుకోవటం మూర్ఖత్వమని అతనే అన్నాడు. అలాటప్పుడు సంధ్యని చేసుకోమని అడిగితే తప్పేముంది?



సంధ్యకే అతన్తో వివాహానికి ఏ అభ్యంతరమూ ఉండదు. ఆమె కోరుకున్న లక్షణాలన్నీ అతన్లో ఉన్నాయి. నిజమే! ఆమె అన్నట్లు ఆస్తీ, అంతస్థూ ఉన్నా, మంచితనం, సంస్కారం కొందరు యువకుల్లో ఉంటాయన్న యధార్థానికి తార్కాణమ్ ఉదయ్! పైగా ఉదయ్ తనకి మంచి స్నేహితుడు.వాళ్ళిద్దరూ వొప్పుకుంటే మామయ్యకి తనిచ్చిన మాట నిలబెట్టుకున్నట్లే!' ఆలోచిస్తున్న లక్ష్మణ్ కారుహారన్ విని అటు చూసాడు. అతని పరధ్యానాన్ని గ్రహించాడా అన్నట్లు అంతదాకా అదే పనిగా హారన్ కొడ్తున్న ఉదయ్ వీడ్కోలు తీసుకుంటున్నట్లుగా చెయ్యి ఊపి కారు స్టార్ట్ చేసాడు. లక్ష్మణ్ ఊపుతున్న చెయ్యి క్రిందికి తీసుకునేలోగా కారు మెరుపులా గేట్లోనుండి బయటికి దూసుకుపోయింది.

ఒక ఆలోచన వచ్చిందంటే దాన్ని వెంటనే అమలు పెట్టక పోతే తోచదు లక్ష్మణ్కి. ఆ మర్నాడే ఉదయ్ని ఒంటరిగా పబ్లిక్ గార్డెన్స్కి తీసుకెళ్ళి మాట్లాడాడు.

"ఉదయ్! సంధ్యని ఈ నాలుగైదు నెలలుగా నువ్వు చూస్తూనే ఉన్నావు. చాలా మంచి పిల్లనే భావన కూడా నీ కుంది. అవునా?" ఉపోద్ఘాతంగా అన్నాడు.

పచ్చిగడ్డిలో రుమాలు పరుచు కూర్చున్న ఉదయ్ అంగీకారంగా తల ఊపి, "అవును. అయితే?!" అడిగాడు.

"డొంకతిరుగుడు పద్ధతి నా కిష్టం లేదు. సూటిగా చెప్తున్నాను. సంధ్యని పెళ్లి చేసుకోటానికి నీ కేమైనా అభ్యంతరమా అని అడగటానికే ఇంత దూరం నిన్ను తీసుకొచ్చింది" అన్నాడు సూటిగా చూస్తూ.

"నా అభ్యంతరం మాట అలా ఉంచు. నీకేం అభ్యంతరమో నేను ముందు తెలుసుకోవాలి" అధికారయుక్తంగా అడుగుతున్న అతని వంక నవ్వుతూ చూసి,

"నాకు తెలుసు. నువ్వీ ప్రశ్న అడుగుతావని. జవాబు చెప్పటానికి సిద్ధపడే వచ్చాను. నిజానికి అభ్యంతరం ఉన్నది నాకు కాదు. సంధ్యకే! ఇంకా విపులంగా చెప్పాలంటే ఒక విధంగా ఆమెచేత నేను తిరస్కరింపబడ్డాను" అన్నాడు. చివరి మాటలు చాలా మామూలుగా అనాలని ప్రయత్నిస్తూ.

ఉదయ్ విస్ఫారిత నేత్రాలతో చూసాడు. "నువ్వు సంధ్యని పెళ్లి చేసుకోమని అడిగినప్పుడు కూడా నే నింత ఆశ్చర్యపోలేదు. నిన్ను సంధ్య తిరస్కరించిందంటే నేను నమ్మను" అన్నాడు.

"నమ్మకపోవటానికిందులో ఏమీ లేదు ఉదయ్! సంధ్యకి కొన్ని నిర్దుష్టమైన అభిప్రాయా లున్నాయి. డబ్బూ, హోదా లేనిదే మనకంటూ వ్యక్తిగా గుర్తింపు ఉండదని ఆమె భావన. అది నిజమేనేమోకూడా! ఉదాహరణకి నన్నేతీసుకో. నా తెలివు విషయంలో నీ పలుకుబడి ఉపయోగించుకోవలసి వచ్చింది. అలాటి పలుకుబడితో పాటు మంచితనం, సంస్కారం కలిగిన వ్యక్తిని భర్తగా కోరుకుంటోందామె. అవన్నీ నీలో ఉన్నాయి. నువ్వు ఇష్టపడే అర్హతలు సంధ్యకీ ఉన్నాయి. అందుకే నాకీ ఆలోచన వచ్చింది."

*జరిగినకథ 3:* గోపాలరావు గారి కూతురు సంధ్య. తనకు ఆరోగ్యం బాగుండలేదని ఓసారి రమ్మని తనని పెంచి పెద్దచేసిన మామయ్య గోపాలరావుగారు వ్రాయటంతో వెంటనే బయల్దేరి వెళతాడు లక్ష్మణ్ సంధ్యని పెళ్లిచేసుకోవాలనుకుంటాడు లక్ష్మణ్. తను తన భర్తా కార్లలో తిరగాలనీ బంగళాల్లో వుండాలనీ కలలు కంటుంది సంధ్య. సంధ్య కోరుకున్నట్లుగా ఆమె వివాహం జరిపిస్తానని లక్ష్మణ్ దగ్గర మాట తీసుకుని కన్ను మూస్తారు గోపాలావుగారు. లక్ష్మణ్ దగ్గరకు వచ్చేస్తుంది సంధ్య. సంధ్యకుతనస్నేహితుడు ఉదయ శంకర్ని పరిచయం చేస్తాడు లక్ష్మణ్.

ఉదయ్ ఒక నిమిషం పాటూ విద్యుద్ఘాతం తగిలిన వాడిలా ఉండిపోయి మరుక్షణమే తేరుకుని, "సంధ్య ముఖం చూసిన వారెవరూ ఆమెకన్ని ఊహాలున్నాయనుకోరు. అందుకే అంత షాక్ అయ్యాను." అంటూ ఆగి కాస్సేపు ఆలోచించి. "పోన్లే! ఇప్పుడవన్నీ అప్రస్తుతం. నీ ప్రశ్నకి నేనూ సూటిగానె సమాధానం చెప్తున్నాను. సంధ్య కిష్టమైతే ఆమెని చేసుకోటానికి నాకేం అభ్యంతరం లేదు." అన్నాడు.

అతనంత త్వరగా వొప్పుకుంటాడని ఊహించని లక్ష్మణ్. కళ్లల్లో కృతజ్ఞతతో, "థాంక్యూ ఉదయ్! సంధ్య ఇంత అదృష్టవంతురాలవుతుందని ఎప్పుడూ ఊహించలేదు" అన్నాడు. ఉదయ్ నవ్వి వాచి చూసుకుని లేచి నిల్చుని. "వెళ్దామా ఇక!" అన్నాడు. లక్ష్మణ్ అంగీకారంగా తల ఊపి లేచాడు. అతన్ని ఇంటిదగ్గర దింపి ఎప్పటిలా తను దిగకుండా కారు బాక్ చేసుకుని వెళ్ళిపోయాడు ఉదయ్.

లక్ష్మణ్ లోపలికి వచ్చాడు. మల్లెపూల మాల అల్లుతూ సరస్వతమ్మగారితో మాట్లాడ్తోంది సంధ్య.

"బామ్మగారూ! ఓ శుభవార్త! మన సంధ్యకి మంచి సంబంధం చూసాను." అన్నాడు చెప్పులు ఓమూలగా విప్పి లోపలికి వస్తూ.

సరస్వతమ్మగారితో పాటు సంధ్య కూడా ఆశ్చర్యంగా తలెత్తి చూసింది. "ఎవరు బాబూ? నీకు తెలిసిన వాళ్ళేనా?" ఆశ్చర్యంగా అడిగింది సరస్వతమ్మగారు.

"ఎవరో కాదండీ. రోజూ మనింటికి వస్తూంటాడు చూడండి నా స్నేహితుడు. ఉదయ్! వాడినే సంధ్యని చేసుకోమని అడిగాను. వెంటనే వొప్పుకున్నాడు. ఇక మన సంధ్య కూడా 'ఊఁ' అంటే ముహూర్తాలు పెట్టుకోవటమే!" అంటూ సంధ్య వైపు తిరిగి, "ఏం సంధ్యా! నీ కిష్టమేనా? ఇష్టం లేదనటానికి ఆస్కారమే లేదనుకో! ఉదయ్కి చదువూ, సంస్కారం. ఆస్తీ, అంతస్థూ అన్నీ ఉన్నాయి. అయినా నువ్వొప్పుకున్నావని నీ నోటితో చెప్తే నాకు తృప్తిగా ఉంటుంది." అన్నాడు.

సంధ్య నమ్మలేనట్లు అతని మాటలు వింటూండిపోయింది. లక్ష్మణ్ బావ అన్నట్లు ఉదయ్కి మంచి హోదా ఉంది. పెద్ద ఇల్లూ అంబాసిడర్ కారూ, ఇంటినిండా నౌకర్లూ... తను కోరుకున్న విధంగా ఉండవచ్చు ఇంత మంచి అవకాశాన్నెందుకు వదులుకోవాలి?"

"ఏమంటావు సంధ్యా!" లక్ష్మణ్ ప్రశ్నతో తేరుకుని,

"సరే!" అంది వొప్పుకుంటున్నట్లు తలాడిస్తూ.

లక్ష్మణ్ తేలిగ్గా ఊపిరి పీల్చుకుని తన గదిలోకి వచ్చేసాడు. ఎందుకో అతని మనసంతా భారమైపోయింది. సంధ్య భవిష్యత్తు ఆమె కోరుకున్న విధంగానే మారబోతున్నాదన్న తృప్తి ఓ ప్రక్క ఆనందాన్ని ఇస్తున్నా,

# నాకు తెలుసుగా గ్లైకోడిన్ నమ్మకమైనదని—

## ఆయన దగ్గుకు ఇట్టే ఉపశమనాన్ని కలిగిస్తుందని...



## భారతదేశంలో దగ్గులను నివారించే యితర మందులకన్న, గ్లైకోడిన్ ఎందరికో దగ్గునుండి ఉపశమనాన్ని కలిగించింది.

## అందుకే ఇది ప్రథమశ్రేణికి చెందినది.




ఇది దగ్గు బాధించే అన్ని భాగాలలోనూ త్వరగా పనిచేసి త్వరితమైన, ఖచ్చితమైన ఉపశమనాన్ని యిస్తుంది.

- గొంతు మంటను తగ్గిస్తుంది.
- కఫమును తొలగించి జలుబు వల్ల వచ్చే దగ్గుల నుండి ఉపశమనాన్ని యిస్తుంది.
- సుఖ నిద్రను కలిగించి, ఛాతీలో కండరాల బిగువును తగ్గించి, సులభంగా శ్వాస పీల్చేందుకు తోడ్పడుతుంది.

దగ్గు ఎలాంటిదైనాసరే—పూర్తిగా అదపులోకి తెచ్చేందుకు మంచి రుచికరమైన గ్లైకోడిన్‌పై మీరు ఆధారపడవచ్చు.




గ్లైకోడిన్—దగ్గులను కొట్టిపడవేయు భారతదేశపు ఛాంపియన్—విశ్వసనీయమైన మందులను తయారుచేసే అలెంబిక్ సంస్థ ఉత్పాదన.

everest/520/ACW-tl

**మరో వంక తన కళ్ళముందు పెరిగి తనకే** చెందుతుందనుకున్న వ్యక్తి మరొకరిదై పోతోందంటే రెట్టింపు బాధ కలిగిస్తోంది. చిన్న పిల్లవాడి ఎదురుగా తాయిలం పెట్టి, ఆశ చూపి, చివరికి 'ఇది నీకు కాదు' అంటే ఎలా వుంటుందో అలా ఉంది. నిన్నటిదాకా 'ఉదయ్‌ని అడగాలి. అతను ఒప్పుకోవాలి. ఆ తరవాత సంధ్య అంగీకారం కావాలి' అన్న ఆలోచన మాత్రమే ఉండేది. ఇప్పుడలా కాదు. అతను ఒప్పుకున్నాడు. సంధ్య కూడా సరే నన్నది. త్వరలో పెళ్ళికూడా అయిపోతుంది. ఇప్పటిదాకా మానసికంగా మాత్రమే తనని దూరం చేసిన సంధ్య ఆ తరవాత మనిషి కూడా దూరమైపోతుంది, ఓహ్! సంధ్యలేని జీవితం ఎలా గడపటం?!' ఐదు నిమిషాలు ఆలోచించేసరికే మనసులోని దావానలమంతా బయటికి పొంగుతోందా అన్నట్లు తన శరీరం తనకే వెచ్చబడ్డట్లనిపించింది లక్ష్మణ్‌కి. చిన్నప్పట్నుండీ అతని శరీర తత్వమే అంత. ఏ మాత్రం బాధపడ్డా మొదట తలనొప్పి, ఆ తరవాత జ్వరం వచ్చేస్తాయి. అందుకే వెంటనే ఓ ఆస్ప్రో బిళ్ళ వేసుకుని దేని గురించీ ఆలోచించకుండా ఉండటానికి ప్రయత్నిస్తూ గడిపేసాడు.

సంధ్య ఒప్పుకుందని తెలియగానే ఉదయ్ రాకపోకలు మరింత ఎక్కువయాయి. లక్ష్మణ్ సాధ్యమైనంత వరకూ వాళ్ళని ఒంటరిగా వదిలేసి వెళ్ళిపోయేవాడు. సంధ్య కదేమంత ఇష్టంలా కనిపించేది కాదు.

# ఆమెకేం కావాలి?

ఓ రోజు ఉదయ్ సంధ్యతో, "రేపు గోల్కొండకి వెళ్తున్నాం మనం. పొద్దున పది గంటలకి రెడీగా ఉండు" అన్నాడు.

"ఎవరెవరం?" సంధ్య కుతూహలంగా అడుగుతూంటే ఆశ్చర్యంగా చూసి,

"ఎవరెవరా?! నేను మనిద్దరం తప్ప ఎవరూ ఉండకూడదని అనుకుంటూంటే?!" అన్నాడు నవ్వుతూ.

సంధ్య తలవంచుకుని చీర అంచు చూసుకుంటూ కూర్చుంది. తనకే విచిత్రంగా సిగ్గూ బిడియాల్లాటివేవీ కలగలేదామెకి.

"బావతో కలిసి ఒకసారి చూసేసాను." అని మాత్రం అన్నది.

"చూస్తే మాత్రం ఏం? ఆ అనుభవం వేరు. ఈ అనుభవం వేరు. రేపు వెళ్ళినప్పుడు నీకే ఆ భేదం తెలుస్తుంది." అన్నాడతను నవ్వుతూ.

ఎన్ని ఆస్ప్రో బిళ్ళలు మింగినా లక్ష్మణ్‌కి ఆ రాత్రి బాగా జ్వరం వచ్చింది. మర్నాడు పొద్దునకి కూడా అలాగే తగ్గకుండా ఉండటంతో సంధ్యకి అతన్ని విడిచి ఎక్కడికీ కదలాలనిపించలేదు. కానీ ఆమెకి తెలుసు ఉదయ్‌ని చిన్నబుచ్చితే అతనికి కోపం వస్తుందని అతనే 'లక్ష్మణ్‌కి జ్వరంగా ఉందికాబట్టి ఈ రోజు ఇంట్లో ఉండి అతన్ని చూసుకో సంధ్యా!' అంటాడేమోనని ఎదురుచూసింది కానీ ఉదయ్ నోటి నుండి అలాటి వాక్యమే రాలేదు.

తప్పనిసరిగా ఉదయ్ వెంట కారు దగ్గరికి నడిచింది. ఉదయ్ ఫ్రంట్ సీట్‌లో ఎక్కి కూర్చుని సంధ్య వెనకవైపు తలుపు తెరవటానికి ప్రయత్నిస్తూండటం చూసి, "ఇలా వచ్చి కూర్చో సంధ్యా! కాబోయే భార్యభర్తలు పక్కపక్కనే కూర్చోవాలి" అన్నాడు.

సంధ్య తటపటాయించింది. లక్ష్మణ్ డ్రైవ్ చేసిన ఆ ఒక్క రోజూ తప్ప ఇంత దాకా మళ్ళీ ఫ్రంట్ సీట్‌లో కూర్చోలేదామె. ఇప్పుడు ఇతని పక్కన కూర్చోవాలంటేసిగ్గు కాదు కానీ ఏదోగా ఉంది.

"ఫరవాలేదు. నేను వెనకే కూర్చుంటాను." ధైర్యం చేసి వెనక సీట్లోనే ఎక్కి కూర్చుంది.

"ఏం లక్ష్మణ్ పక్కన తప్ప ఎవరి పక్కనా కూర్చోలేవా?" ఉదయ్ కారు స్టార్ట్ చేస్తూ అన్నాడు, సంధ్య ముఖం అదోలా అయిపోయింది. అవును! ఎందుకలా చేసింది తను! కూర్చున్నంత మాత్రంలో తప్పేముంది? పైగా అతనన్నట్లు ఉదయ్ కాబోయే భర్త! కానీ... ఆ ఊహ అనుకున్నంత తృప్తినివ్వటం లేదు! తను అనాలోచితంగా ఒప్పేసుకుందేమో పెళ్ళికి! ఛ! ఛ! ఏమిటింత కోతి మనసైపోతోంది తనది!

ఉదయ్ ఆమె ముఖం చూసి గాభరా పడ్డాడు. "ఊరికే అన్నాను సంధ్యా! సీరియస్‌గా తీసుకోకు. చిన్నప్పట్నుండీ కలిసి పెరిగారు కాబట్టి, అన్నయ్యలా అభిమానిస్తున్నావు కాబట్టి ఆ చొరవ ఉండటం సహజమే! నేను వేరే ఉద్దేశ్యంతో అనలేదు." అన్నాడు.

సంధ్య ఉలిక్కిపడింది. 'అన్నయ్యలా అభిమానిస్తోందా! తను లక్ష్మణ్‌ని అన్నయ్యలా అభిమానిస్తోందా?! ఊహూ! కాదు. అలా అయితే తనకలల్లో అతను హీరోగా చోటు చేసుకోడు. అతని రూపం ప్రతి క్షణం తన కళ్ళ ముందు నిలబడేది కాదు.'

"ఏమిటి సంధ్యా ఆలోచిస్తున్నావు?" అడిగాడు ఉదయ్.

"ఏం లేదు." తేరుకుని జవాబిచ్చింది.

గోల్కొండ చేరుకుని మెట్లెక్కుతూంటే ఉదయ్ అది ఏ కాలం నాటిదో వివరిస్తున్నాడు అవన్నీ లక్ష్మణ్ ఒకసారి చెప్పినవే. పరధ్యానంగా వింటూ మెట్లెక్కుతోంది సంధ్య. కాళ్ళు



# బాపు రమణీయ రూపకల్పన
# దేవులపల్లి, తుమ్మల, ఆరుద్ర, కొసరాజు, దాశరథి, నారాయణరెడ్డి కవిపుంగవుల
# కమనీయ కవితా ప్రవంతి...



## సర్వలక్షణ సమన్వితమై, అతిలోకసుందరమైన
## "సంక్రాంతి లక్ష్మి" స్పెషల్ సెట్టుకు
## సముజ్వలాలంకారాలు
## ఇతర సెట్లుకూడా ఇంతటి ప్రత్యేకతలు కలిగినట్టివే

# స్క్రిప్ట్ ఆర్ట్స్ వారి సంక్రాంతి కార్డుల సెట్టు

| | దుకాణాలలో దొరకును | పోస్టేజితో సహా ధర |
|---|---|---|
| 1. సంక్రాంతి లక్ష్మి స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 10.50 |
| 2. యువతుల (విద్యార్థినుల) స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 9.00 |
| 3. యువకుల (విద్యార్థుల) స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 9.00 |
| 4. మహిళల స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 9.00 |
| 5. పురుషుల స్పెషల్ సెట్ | 6 కార్డులు | రు. 9.00 |
| 6. గ్రామస్థుల సెట్ | 8 కార్డులు | రు. 7.50 |
| 7. బాలికల సెట్ | 8 కార్డులు | రు. 6.00 |
| 8. బాలుర సెట్ | 8 కార్డులు | రు. 6.00 |
| 9. ఎస్సార్టెడ్ సెట్ | 8 కార్డులు | రు. 6.00 |

ఒక్కొక్క కార్డుకు నిర్దేశింపబడిన తెలుగు సందేశం మాత్రమేగాక సెట్ మొత్తంమీద నాలుగు సందేశాలు—రెండు తెలుగులోను, రెండు ఇంగ్లీషులోను—అదనంగా ప్రతి సెట్‌కు పంపగలము.

సెట్లలో మార్పులు, చేర్పులు సాధ్యపడవు. అంటే ఏ సెట్‌కు ఆ సెట్ను మొత్తంగా మాత్రమే తీసుకోవాలి. అంతేకాని ఒక సెట్‌లో కొన్ని మరొక సెట్‌లో కొన్ని కలిపి ఇవ్వజాలము. స్పెషల్ సెట్‌గా ఉదహరించబడినవి అలాగే ఇవ్వగలముగాని వాటికి బదులుగా ఇండియన్ సెట్లు ఇవ్వజాలము. అందుచేత, మేము పైన పేర్కొన్న సెట్లను మాత్రమే-వాటిని వివరంగా ఉదహరిస్తూ-మాకు సంపూర్తిగా వ్రాయాలి.

*ఏ సెట్ కావలసినవారు ఆ సెట్ పేరును ఉదహరిస్తూ, దాని విలువను మనియార్డరుద్వారా పంపించుకోవాలి. అంతేకాని వి.పి.పి.గా పంపే పద్ధతి లేదు. మనియార్డరు పంపకుండా రాసే ఉత్తరాలకు జవాబులు వ్రాయలేము.*

ఇండియా మొత్తంలో వివిధ ప్రాంతాలవారు వ్యాపార వివరాలకు ప్రక్కనున్న చిరునామాకే వ్రాయాలి.

*By Script Arts*
**GREETING CARD**
...to send! Exciting to receive! Treasure to possess!



**Cards**
**Crafts**
**Classics**
"Rangam Bros." Buildings
13/1 General Patters Road
Post Box No. 2421 MADRAS-2
Grams: "CARDCRAFTS"

*For overseas enquiries:*
**SCRIPT ARTS**
8 State Bank Street
Post Box No. 2248
MADRAS 600 002 INDIA
Cables: "SCRIPTARTS"
Phones: 85103 812208



## ఆమెకేం కావాలి?

నొప్పెట్టి ఒకచోట ఆగిపోయింది.

ముందు నడుస్తున్న ఉదయ్ ఆమె కోసం మళ్ళీ వెనక్కి వచ్చి "ఏమిటి ఆగిపోయావు? నేను మరీ త్వరగా ఎక్కుతున్నానా? ఏదీ చెయ్యిలా ఇవ్వు. ఇద్దరం కలిసే ఎక్కుదాం." చొరవగా చెయ్యందించబోయాడు. కానీ సంధ్య అందుకోకుండా మెట్ల మీద కూలబడింది. సరిగ్గా ఇలాగే చెయ్యందించాడు లక్ష్మణ్ కూడా! ఎంత చనువుగా, అతను తనకి పరాయి వాడు కాదు అన్నంత ధీమాగా అందుకుందప్పుడు! ఎందుకో నీరసంగా, అనాసక్తిగా ఉందామెకి. పాపం లక్ష్మణ్ కెలా ఉందో! తలనొప్పి వస్తే ఒక యోగాన పోదతనికి. తలనొప్పితో కూడిన జ్వరమైతే ఆ బాధ వర్ణనాతీతం. తనుంటేనన్నా అప్పుడాప్పుడూ అమృతాంజనం వ్రాసేది. తనపిచ్చిగానీ అతనంత చొరవివ్వడు ఇప్పుడు. తనకి పనులు చేసే హక్కు అతనో: జీవితం పంచుకునేవారికి మాత్రమే ఉంటుందని చెప్పాడుగా! అతని కష్టసుఖాలు పాలు పంచుకోవాలని ఇంతగా ఉబలాట పడుతున్న తను అతనో జీవితాన్ని పంచుకుంటానని ఎందుకు చెప్పలేకపోయింది?'

"వింటున్నావా సంధ్యా?" ఉదయ్ ప్రశ్నతో తేరుకుని, "ఆ! ఆ!" అన్నది అతను ఏం చెప్తున్నాడో వినకపోయినా.

"మనం ఇప్పుడేదో ఈ డ్రైనేజ్ సిస్టమ్ అదీ కనిపెట్టామనుకుంటున్నాం కానీ అప్పటికే అవన్నీ ఎంత చక్కగా నిర్మించారో చూసావా?" అన్నాడు ఉదయ్ కాస్త దూరంగా చూపిస్తూ.

"అవును" సంధ్య కూడా ఒప్పుకుంది.

"కాళ్ళు నెప్పి తగ్గిందా లేక ఇంకాసేపు కూర్చుందామా?" అడిగాడు ఉదయ్.

"తగ్గింది. పదండి. నడుద్దాం" సంధ్య ఉత్సాహం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ నడిచింది.

కాస్త దూరంపోయాక "ఇది రామదాసుని తానీషా బంధించిన చెరసాల. అక్కడ గుడి ఉంది చూసావా!" చూపించాడతను.

సంధ్య వెంటనే కళ్ళు మూసుకుని భక్తిగా చేతులు జోడించింది. ఆమె కళ్ళు తెరిచాక "ఏం కోరుకున్నావు?" అడిగాడు ఓరగా చూస్తూ.

"లక్ష్మణ్ బావకి త్వరగా జ్వరం తగ్గిపోవాలని. అతని కేదన్నా వస్తే త్వరగా తగ్గదు చాలా బాధ పడ్తాడు."

"జ్వరం తగ్గించటానికి డాక్టర్లున్నారు. నేనింకా మన పెళ్ళి నిర్విఘ్నంగా జరగాలని కోరుకుంటావేమో ననుకున్నాను."

సంధ్య మౌనంగా ఉండిపోయింది పెళ్ళి! అనుకోని విధంగా ఉదయ్‌తో తన పెళ్ళి! ఛ! ఛ! ఆలోచించటానికి కాస్త వ్యవధైనా అడక్కుండా ఎంత ఆత్రంగా ఒప్పేసుకుంది తను! ఇప్పుడు మాత్రం నిజానికి చింతించాల్సిన అవసరం ఎందుకు రావాలి?' ఆత్మ విమర్శ చేసుకుంటూంటే సంధ్యకి చటుక్కున తట్టింది తనెంత గొప్పలు కావాలనుకున్నా తన పక్కన ఆ స్థితిలో లక్ష్మణ్‌నే ఊహించుకుంది. అంటే బావను తను ప్రేమిస్తోందా! నాన్నగారన్నట్లు తనకేం కావాలో సరిగా తేల్చుకోలేక పోతోందా!

సాయంత్రం తిరిగి వచ్చే వరకూ ఆలోచిస్తూనే వుంది. 'నువ్వేదో ఆలోచిస్తున్నావు సంధ్యా!' అని చాలాసార్లే అన్నాడు ఉదయ్. 'అహఁ! ఏం లేదు' అంటూ తప్పించుకుంది ఇంటికి వచ్చాక,

"ఎలా వుంది సంధ్యా పిక్‌నిక్!" అడిగాడు లక్ష్మణ్. అతను చాలా నీరసంగా ఉన్నాడు.

"బాగానే ఉంది. నీకు ఒంట్లో ఎలా వుంది?" ఆదుర్దాగా అడిగింది సంధ్య అతని నుదుటి మీద చెయ్యి వేసి, "బాగా జ్వరం ఉంది" అన్నది విచారంగా.

ఉదయ్ అతన్ని టెస్ట్ చేసి ఏవో మాత్రలు రాసిచ్చి వెళ్ళిపోయారు. అతని చేతి మహత్యమో లేక సంధ్య ప్రార్థన ప్రభావమోగాని ఎప్పుడూ లేనిది రెండ్రోజుల్లో పూర్తిగా తేరుకున్నాడు లక్ష్మణ్.

ఆ రోజు ట్యుటోరియల్ కాలేజీకి వెళ్ళే సమయానికి కారు పంపాడు ఉదయ్.

"అయ్యగారు మిమ్మల్ని కాలేజి దగ్గర దింపి రమ్మన్నారమ్మా!" అంటూ వచ్చాడు నౌకరు వెంకయ్య. వాడికి కూడా డ్రైవింగ్ వచ్చు.

"వద్దు. అట్టే దూరం లేదు. నడిచి వెళ్ళిపోతానని చెప్పు మీ అయ్యగారితో." అని వాణ్ణి పంపేసింది సంధ్య. నిజానికి అలా చేయటంలో అర్థం లేదు. ఇలాటి గొప్పలేగా తను కోరుకుంది! తను కార్లో వెళ్తూంటే చుట్టుపక్కల వాళ్ళందరూ ఈర్ష్యగా చూస్తే,

(36 వ పేజీ చూడండి)

# హార్లిక్స్ ఆరోగ్యం.
# నాడూ, నేడూ, ఎల్లప్పుడు కూడా.

**అంటుంది సుచిత్ర**

**హార్లిక్స్ ఆరోగ్యంతో మీ కుటుంబపు భవిష్యత్తు తీర్చి దిద్దుకోండి.**

ఆరోగ్యమే మహా భాగ్యం. విజయాలు, ఆనందం. ఆరోగ్యంగా వుంటే రోగాలు వుండవు. శ్రద్ధ పెరుగుతుంది.

అందువల్లనే సుచిత్ర, హార్లిక్స్‌ని తన కుటుంబపు జీవనంలో ఒక భాగంగా చేసుకుంది. హార్లిక్స్ కాల పరీక్షకి నిలబడుతుందని ఆమెకు తెలుసు.

హార్లిక్స్...ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేసేదియిది ఒక్కటే. అంత ఎక్కువగా పుష్టి యిచ్చేది హార్లిక్స్ ఒక్కటే. ఎందుచేత నంటే, ఇందులోని బలవర్ధకమైన, కల్తీ లేని పదార్థాలని అపూర్వమైన హార్లిక్స్ తయారీ పద్ధతి ద్వారా సమ్మిళితం చేయబడ్డాయి.

సుచిత్ర మోస్తరుగానే మీరు కూడా మీ కుటుంబానికి ప్రతి రోజు హార్లిక్స్ యివ్వండి. ముందు ముందు వారు ఎంతో ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"మీరు హార్లిక్స్‌ని నమ్మవచ్చు.
నేను ఎల్లప్పుడు హార్లిక్స్‌నే సిఫార్సు చేస్తాను.

ఆరోగ్యంగా వున్నప్పుడు పుష్టిగా వుండటానికి హార్లిక్స్ పుచ్చుకోమని చెబుతాను. దీనికి కారణం చాలా స్పష్టమైనదే. హార్లిక్స్ శుద్ధమైనది. శక్తి వుంది. మాంసకృత్తులు, కార్బోహైడ్రేట్లు, ఖనిజాలు యిందులో చక్కగా కలిసి వున్నాయి. ఇవన్నీ నిత్యం మంచి ఆరోగ్యంగా వుండటానికి సహకారి."





ఒక రూపాయి
ఆదా చేయండి.
800 గ్రాం ఎకానమీ
బాటిల్ కొనండి.




**దీనిలో ఆరోగ్యముంది.**

**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ ఒక రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

Mx-4181 Tel.

సీరియల్

# డాక్టర్ వనిత

గంటి వెంకటరమణ

(గత సంచిక తరువాయి)

ఆరు నెలలు రాత్రింబవళ్ళు గాంధీ ఎంతో ప్రయత్నంచేసి గోకుల్‌తో మాట్లాడగలిగాడు. జరిగిన సంగతులేవీ దాచకుండా అతనితో చెప్పి నెహ్రూ కొన్నాళ్ళుంటాడని ప్రాధేయపడ్డాడు. రక్త సంబంధమో, వనిత బాధ్యత పూర్తిగా విరగడ అయిపోతుందనో మొత్తంమీద గోకుల్ ఏ కళనున్నాడో? నెహ్రూని తన దగ్గర వుంచుకునేందుకు ఒప్పుకున్నాడు. గాంధీకి చాలా సంతోషంగా వుంది. తను ఇన్నాళ్ళూ 'ఎస్కేపిస్ట్' నెహ్రూ పరిభాషలో. ఇవాళ ధైర్యంగా అతన్ని ఎదుర్కోవచ్చు. ఆ సంగతే తలుచుకుంటూ వచ్చాడు.

గాంధీ రాగానే 'ఏమైందండీ' అని అడిగాడు నెహ్రూ.

'అయిపోయింది. నువ్వు వచ్చే నెలలో వెడుతున్నావు.' అన్నాడు.

'నిజంగా !'

'నిజం.'

'థాంక్సండీ ! మీరు చాలా మంచివారు. ఇవాళే అంటున్నానని అనుకోవద్దు. నేను ముందే అన్నానుకదండీ !'

'ఏమిటో యీ అండీ పదం ?' గాంధీ మనసులో అనుకుని 'వూఁ! వూఁ' అన్నాడు నవ్వుతూ

గోకుల్ రాసిన ఉత్తరం రావుగారు చదివి 'నువ్వు వెళ్ళక తప్పదా నెహ్రూ !' అని అడిగారు.

నెహ్రూ తల వూపాడు 'వెళ్ళిపోవాలి' అన్నట్లు. 'నీ యిష్టం.' అన్నాడు గాంధీ.

* * *

నెహ్రూ ప్రయాణమై వెళ్ళిపోయాడు. అతను రావడంతో గోకుల్ ... అతని పరివారం మొత్తం రిసీవ్ చేసుకునేందుకు అతనికోసం వెళ్ళింది.

నెహ్రూ ఎవర్నీ తండ్రి గురించి ప్రశ్నించలేదు. తన తండ్రి ఎవరో అతను చాలా తేలికగా గుర్తుపట్టాడు. ఆనాడెప్పుడో ఫొటోలో సన్నగా నాజూకుగా వున్న వ్యక్తి యిప్పుడు పొట్టవచ్చి లావుగా అయాడు. హిప్పీమాదిరి జుట్టు పెంచుకున్నాడు. అతనివైపు ఓసారి చూసి 'మీరు నాన్నగారు కదూ !' అని అడిగాడు అచ్చ తెలుగులో.

నెహ్రూ దగ్గరకి వచ్చి అతని తలమీద చేయి వేసి 'యా' అన్నాడు గోకుల్.

ఇంటికి వెళ్ళేవరకూ అతను ఏమీ మాట్లాడలేదు. శ్రీదేవి 'నేను నాయనమ్మని' అంది.

నరహరి 'తాత దగ్గర వుండేందుకు వచ్చేవేమోయ్' అని అడిగాడు. అందరికీ సమాధానాలిస్తూ వాళ్ళు పెట్టింది తిని పడుకున్నాడు.

***జరిగిన కథ-11:*** తల్లి యామినిని చూడ్డానికి ఢిల్లీ నుంచి హైదరాబాద్ వస్తుంది వనిత. రైల్లో తారసపడ్డ ఎమ్. కె. గాంధీ తన అందంతో వనిత హృదయంలో తిష్టవేస్తాడు. యామిని అన్న నరహరి. శ్రీదేవి నరహరిల రెండో కొడుకు గోకుల్. తనను పెళ్ళాడమని గోకుల్ అనటంతో గాంధీ గుర్తుకొస్తాడు వనితకి. గతంలో... యామిని కిష్టం లేకపోయినా భగవన్నారాయణ రావుతో వివాహం జరిపిస్తాడు తండ్రి వేణుగోపాల్. తన మాటే నెగ్గాలనే రావ్ మనస్తత్వానికి ఎదురు తిరుగుతుంది యామిని. చదువుకోకపోవటం అనర్హతగా యామినిని వదిలి లండన్ వెళ్ళిన రావ్ అక్కడ మరో పెళ్ళి చేసుకుంటాడు. గోకుల్‌తో పెళ్ళయిన వెంటనే అమెరికా వెళ్ళిపోతుంది వనిత. గాంధీ తండ్రి పట్నాయక్‌గారు రాజకీయవాది. పట్నాయక్ ఆదరణలో పెరిగిన హరిజన యువతి కాదంబరి గాంధీని ప్రేమిస్తుంది. వనితకి వివాహ మయిందని తెలిసిన గాంధీ వ్యాకులత చెందుతాడు. గోకుల్ కోరుకునే సంఘ జీవనానికి అలవాటు పడలేకపోతుంది వనిత. తన ఎదుటే గోకుల్ పరాయి స్త్రీని చేరదీయటంతో వనిత మనసు విరిగిపోతుంది. గోకుల్‌ని వదిలి హైదరాబాద్ వచ్చేసిన వనిత కొడుకు నెహ్రూతో తండ్రి దగ్గర స్థిరపడుతుంది. పదేళ్ళలో వనిత తల్లీ తాతగారు కాలగర్భంలో కలసిపోతారు. ఓరోజు నెహ్రూ తమ స్కూలుకి మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ వచ్చారనటంతో వనిత హృదయంలో అలజడి ప్రారంభమౌతుంది. గాంధీని కలుసుకుని తనతోబాటు ఇంటికి తీసుకువస్తుంది వనిత. వనితతోను, కాదంబరితోను తన పెళ్ళి తప్పిపోవడంతో బ్రహ్మచారిగా వుండిపోతాడు గాంధీ. వనితకీ గాంధీకి పెళ్ళి జరిపిస్తారు రావ్‌గారు. "నాకు మా నాన్నే కావాలి. నన్ను ఆయన దగ్గరకు పంపించండి" అన్న నెహ్రూ కోరిక తీరుస్తానని మాట ఇస్తాడు గాంధీ.

అతనికి తల్లి జ్ఞాపకం వచ్చింది. ఆవెంట ఎన్నో జ్ఞాపకాలు... చిరంజీవి తల్లి తనకు చేసిన అవమానం అతనికి శూలం మాదిరిగా గుచ్చుకుంటోంది. ఇప్పుడీ యింట్లో... ఒక్కసారి వులిక్కిపడ్డాడు నెహ్రూ ఒంటరిగా... తాతగారి గదిలో ఎవరూ లేరు. నానమ్మ ఎక్కడుందో. తను వెళ్ళి అక్కడ ఆయన గదిలో పడుకుంటె... అడుగులో అడుగు వేసుకుంటూ నరహరి గదిలోకి వచ్చాడు. అతను మంచంమీద గాఢ నిద్రలో వున్నాడు. నెహ్రూ యిప్పటివరకూ వొంటరిగా పడుకోలేదు. రాత్రి లైటు ఆర్పేసి పడుకోవడం అంటే మరీ ప్రాణాంతకంగా వుంటుంది. నెహ్రూ అతని మంచం దగ్గరకి వచ్చి నిశ్శబ్దంగా అతని పక్కనే చోటు చేసుకుని పడుకున్నాడు. రెండు మూడు నిమిషాలు అయాక 'ఎవరూ... నువ్వా నెహ్రూ ఏం నాయనా నిద్రపోలేదా?' అని అడిగాడు నరహరి.

'నిద్ర రాలేదండి.'

'పోన్లే పడుకో... నేనా మంచంమీద పడుకుంటాను. నాకు మంచం కదుల్తే నిద్ర పట్టదు' అని నరహరి మరో మంచంమీద పడుకున్నాడు. నెహ్రూకి భయం వేసింది. అతను కళ్ళు తెరిచి జీరోవాల్ట్ బల్బ్‌కేసి చూస్తూ ఆ రాత్రి గడిపేశాడు. తెల్లవారింది. ఎవరికివారే చాలా హడావుడిగా వున్నారు. శ్రీదేవి వంట చేస్తోంది. నరహరి ఎక్కడికి వెళ్ళాడో మరి? తండ్రి గదిలోంచి భుజాల వరకూ కత్తిరించుకుని గౌను తొడుక్కున్న స్త్రీ రాగానే నాయనమ్మని అడిగాడు 'ఆమె ఎవరండీ' అని.

'మీ పిన్ని'

ఆ మాట వినేందుకు బాగులేదు నెహ్రూకి. అతను మాట్లాడకుండా తను నిన్నటినుంచీ వున్న గదిలోకి వెళ్ళిపోయాడు. ఎవరూ ఎక్కువగా మాట్లాడడంలేదు. ఒక మాట ఎక్కువ రెండు మాటలైతే తక్కువా అన్నట్లు తూచి తూచి మాట్లాడుతున్నారు. అంతా గడియారంలో ముళ్ళ మాదిరి ఎవరి పనులు వాళ్ళు చేసుకోవడమేగానీ మరో వ్యక్తిని గురించి ఆలోచనే లేదు. 'ఇక్కడికన్నా అక్కడే... నెహ్రూ మనసుని అదిమిపెట్టేశాడు. అతని కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

'పోవే పోవే... మీ యమ్మగాయన్నుంచుకున్నది గాక...' చాచి లెంపకాయ కొట్టినట్లు రిక్షా లాగే సోనాజీ కొడుకు ఎంత మాటన్నాడు ?

చిరంజీవి, అనూప్, తనూ ఆడుకుంటూంటే రిక్షా సోనాజీ కొడుకు 'లట్టూ' ఆడేందుకు వచ్చాడు. వాడూ వాడి మురికిబట్టలూ, వాడి అవతారం దగ్గరకి రాగానే గుబాళించిన సెంటుకన్నా త్వరగా ఘ్రాణేంద్రియాల్ని సోకే చమట వాసన... జుగుప్స కలిగే ఆ ముక్కు చీమిడీ... తలుచుకుంటే యిప్పుడు కూడా వాంతి వచ్చినట్లయింది నెహ్రూకి.

వాడు ఆటకి రాగానే 'ఛీ!' అన్నాడు అప్రయత్నంగా. వాడు బొంగరానికి తాడు చుట్టి అంతవరకూ ఆడుతున్న ఆ పెద్ద రింగ్‌లోకి తన బొంగరాన్ని కూడా వేశాడు. నెహ్రూ కోపం పట్టలేక వాడి బొంగరాన్ని దూరంగా పడేశాడు. చిరంజీవి, అనూప్ 'పోనీలేరా!' అన్నారు వాడిని

వెనకేసుకువస్తూ. 'ఛీ! పోనీట పోనీ ... వాడెక్కడ మనం ఎక్కడ ?' అన్నాడు నెహ్రూ.

'ఏమైందిలే యిప్పుడు. వాడు ఆట ఆడి వెళ్లిపోతాడు. బాగా ఆడతాడుగా. ఎందుకు వాణ్ణి వెళ్లగొట్టేయడం ?'

స్నేహితు లిద్దరూ వాడిని బలపరుస్తున్నారు.

'నో! నాకు యిష్టంలేదు. మా తాతగారు అసలు వొప్పుకోరు. మన స్టేటస్, వాడి స్టేటస్ కంపేర్ చేయమంటారు. అయినా వాడితో మనకేం ఆట ? వాడు మన రిక్షాలాగి బ్రతికేవాడి కొడుకు !' రోషంగా అన్నాడు నెహ్రూ.

ఈమాట వింటూనే సోనాజీ కొడుకు రెచ్చిపోయాడు. మీది మీదికి వస్తూ 'ఏమన్నవ్ బే! మీయమ్మ గాణ్ణెవర్నో వుంచుకోలే. ఓయబ్బ మాలావు చెప్తుండు.' అన్నాడు.

నెహ్రూ నిర్ఘాంతపోయాడు. కొంతసేపటికి తేరుకుని బొంగరం విసిరేసి యింటివైపే పరుగు తీశాడు. తల్లి అప్పుడే వస్తోంది హాస్పటల్ నుంచి. అతను ఆమెకు దూరంగా వెళ్లిపోయాడు. ఆ తరువాత స్కూలుకి వెళ్లినా యివే మాటలు. అతనికి తల్లిమీద కోపం, అసహ్యం కలుగుతున్నాయి. సాధ్యమైనంతవరకూ ఆమెకు దూరంగా వుండేట్లు తప్పుకుని తిరిగేవాడు. ఎప్పుడైనా కనిపిస్తే కనుబొమ్మలు ముడివేసి చిరాకుగా మొహం పెట్టేవాడు. ఆమె పెదవి విప్పి మాట్లాడేది. చిన్నబోయినట్లు వెళ్లిపోయేది.

ఆ తరువాత...నెహ్రూ ఆలోచనలకి తనమీద తనకే జుగుప్స ఏర్పడింది. ఒకరోజు ... ఆరాత్రి వనిత అతని పక్కనే పడుకుని జుట్టులోకి వ్రేళ్ళు పోనిచ్చి గుండెలకి అదుముకుని నుదుటిమీద ముద్దు పెట్టుకుంది. ఆ చప్పుడూ స్పర్శా విని అతనికి మెలుకువ వచ్చింది. కళ్లు తెరచి తల్లివైపు ఆమె మొహంలోకి చూశాడు. ఆమె జాలిగా అతనివైపు చూసింది. చాలాకాలం తరువాత ఒకరి కొకరు తప్పిపోయిన బాటసారులు కలుసుకున్న అనుభూతి పొందారు. అతను ఆమె మెడచుట్టూ చేయివేసి దగ్గరికి తీసుకున్నాడు. మంచి నిద్రపట్టింది. ఇంతలో తెలివి వచ్చింది. ఎప్పుడు తెలివి వచ్చిందో దాహంతో నోరు ఎండిపోతోంది. 'మమ్మీ! మమ్మీ' అని రెండుసార్లు పిలిచాడు. పక్కనేవున్న తల్లి లేదు. అక్కడేవున్న బాత్‌రూమ్ వైపు వెళ్లి చూశాడు. ఆమె లేదు. తలుపు వెంటనే వచ్చేసింది. అక్కడ లేదు ఆమె. అతను గదంతా చూశాడు. భయంతో ఒళ్లు గగుర్పాటు చెందింది. పుట్టి పన్నెండేళ్లు అయినా అతనికి తల్లి పక్కనే పడుకోవడం అలవాటు. తన పక్కనలేని తల్లి యెక్కడికి పోయివుంటుంది ? ఈ ఆలోచన రాగానే అతను తాతగారి రూమ్‌వైపు పరిగెత్తాడు. ఆయన గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. అక్కడ క్షణంసేపు ఆగి రెండు క్షణాలు ఆలోచించి వెనక్కివచ్చాడు. అనుమానంగా గాంధీ గదివైపు చూశాడు. అతనికి ఏమీ కనిపించలేదు. తలుపులన్నీ వేసివున్నాయి. మరోసారి తొంగిచూద్దామని ప్రయత్నించాడు. సందులో నన్నని బెడ్‌రూామ్ లైట్ కాంతిలో అతనికి తల్లి కనిపించింది. ఆమె అతన్ని పెనవేసుకుని



వుంది.' అతనామె నడుముచుట్టూ చేతులువేసి దగ్గరకు లాక్కున్నాడు.

నెహ్రూ కాళ్ళల్లోంచి వొణుకు ప్రారంభం అయింది. అతనికి ముచ్చెమటలు పోస్తున్నాయి. తన గదిలోకి వెళ్ళి పడుకునేందుకు భయంవేసింది. తాతగారి గదిలోకి వెళ్ళి ఆయన పక్కన చోటు చేసుకుని పడుకున్నాడు.

'నెహ్రూ!' వనిత పిలిచింది. ఆ కేక వినిపించినా అతనికి లేవాలనిపించలేదు. మాట మాటకీ 'ఛీ!' అనుకుంటున్నాడు.

---

### కరుణించు మేరీ మాతా !



పిలార్ చర్చి (గోవా) లోని మేరీమాత చిత్రం

— ఫొటో : డా. కె. పురుషోత్తం

## డాక్టర్ వనిత

'ఇక్కడున్నావా? యిల్లంతా వెతికి వెతికి బేజారైపోయాను. లే నాన్నా! లేచి మొహం కడుక్కునిరా.' అంది వనిత. ఆమె చేయి అతని ముంగురుల్ని సవరిస్తోంది. అతనికి ఆ చేతిని త్రోసేయాలనిపించింది. రాత్రి ...

లేచి బాత్‌రూమ్ వైపు వెళ్ళాడు. మొహం కడుక్కుని బయటికి వస్తూంటే గాంధీ ఎదురై 'గుడ్‌మార్నింగ్!' అన్నాడు. నెహ్రూ తల వంకించి వినిపించుకోనట్లు లోపలికి వచ్చేశాడు. వనిత నెహ్రూ ముభావాన్ని భరించలేకపోతోంది. ఆమెకే భయంగా వుంది. నెహ్రూగానీ రాత్రి తనకోసం చూడలేదుకదా అనుకుంటోంది. నెహ్రూనే శ్రద్ధగా పరికిస్తూండడంవల్ల అర్థమైపోయింది ఆమెకి. వంటయింట్లో వంటమనిషితో పేచీ పడుతున్నాడు. వనితకి హాస్పటల్ పనులు ఎక్కువగా వున్నప్పుడు ఆమె వచ్చివెడుతూ వుంటుంది. దిగులుతో శారీరకంగా మానసికంగా అలసిపోయిన వనిత రావుగారి ఈ ఆజ్ఞని తిరస్కరించలేకపోయింది.

'కాఫీ యివ్వండమ్మా' నెహ్రూ ఆమెని అడిగాడు వంటావిడ ఆశ్చర్యంలోంచి తేరుకుంటున్నట్లు 'ఏమిటి కాఫీ కావాలా మీ అమ్మ వింటే... యింకేమైనా వుందా?' అంటోంది ఆవిడ.

నెహ్రూ కంఠం గంభీరంగా వినిపిస్తోంది. అతను తల్లినీ ఆమె ముఖ కవళికల్నీ క్రీగంట గమనిస్తూనే వున్నాడు. అతను అప్రయత్నంగా జాలి పడుతూంటాడు. వెంటనే ఆమె చేసిన 'తప్పు'ని క్షమించలేనట్లు భ్రుకుటి ముడి వేస్తాడు. ఆమెని తాకాలన్నా అతని హృదయం విలవిల్లాడిపోతోంది. 'వీల్లేదు' అనే పరిస్థితికి వచ్చేశాడు. అతనీ వాతావరణానికి అడ్జస్ట్ కాలేకపోతున్నాడు.

'కాఫీ'

'మీ అమ్మగారు' ఆవిడ మాట పూర్తిచేయకుండానే వనిత అక్కడికి వచ్చి 'పోనీవండి సీతారావమ్మగారూ వాడికి ఏది యిష్టమైతే అదే యివ్వండి' అంది.

సీతారావమ్మగారు కాఫీ గ్లాసు తీసుకురాగానే నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు నెహ్రూ. వనిత నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. నెహ్రూ వెనుతిరిగి ఓసారి చూసి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి వనిత అతని గదిలోకి వచ్చింది. లైటు ముందు కూర్చుని దీర్ఘంగా చదువుకుంటున్నాడు నెహ్రూ. ఆమె అతని వెనుకే కుర్చీ దగ్గర నిలుచుని క్రాపులోకి చేయి పోనిచ్చి, 'నామీద కోపం వచ్చిందా నెహ్రూ' అని అడిగింది.

నెహ్రూ తలెత్తి ఆమెవైపు చూసి 'ఎందుకూ నాకేం కోపం లేదు' అన్నాడు.

'యిప్పుడు పన్నెండయింది. పన్నెండేళ్ళయినా లేవు నీకు. యింత రాత్రి వరకూ తెలివిగా వుండద్దు నెహ్రూ. ఆరోగ్యం పాడైపోతుంది. పడుక్కుందాం రా.'

'నేను తాతగారి దగ్గర పడుకుంటాను.'

వనిత మాట్లాడలేదు. రెండు నిమిషాలు అక్కడే వుండి వెళ్ళిపోయింది.

అప్పుడు ప్రారంభమైన సంఘర్షణ అతన్ని అమెరికా ప్రయాణం కట్టించింది...

నెహ్రూ కళ్ళు తడిశాయి. ఎనిమిది గంటలైంది. గోకుల్ అతని గదిలోకి వచ్చి 'గుడ్‌మార్నింగ్ లేచి ఎంతసేపైందోయ్? నిద్ర పట్టిందా' అని అడిగాడు.

నెహ్రూ నవ్వి 'పట్టిందండి' అన్నాడు.

'నువ్వు లేచి చాలాసేపైందని అమ్మ చెప్పింది?' గోకుల్ అన్నాడు.

'అవును. చాలాసేపే అయిందండి' అన్నాడు జవాబుగా.

'నీకు కొత్తకాబట్టి బోర్ కొడుతుంది. పక్కింట్లో పీటర్ వున్నాడు. సీజర్ యిటుపక్క బంగ్లాలో వున్నాడు. వీళ్ళిద్దరూ మీ ఆంటీ శిష్యులు. కొంచెంసేపైతే తప్పకుండా వస్తారు. అప్పుడు పరిచయం చేస్తాను. నేనీలోగా స్నానంచేసి వస్తాను.' అని వెళ్ళిపోయాడు

నెహ్రూ పక్కమీద చాలా మాగజైన్‌లు వున్నాయి. పాత పత్రికలు, నవలలూ కూడా వున్నాయి. ఆ పుస్తకాలన్నీ శ్రీదేవి కాలక్షేపంకోసం ఇండియా నుంచి తెప్పించుకున్నవే.

నెహ్రూ వచ్చి వారంరోజులు కాలేదు. అతనికి రోజుకి నలభైయెనిమిది గంటలేమో అనిపిస్తోంది. ఎంత చదివినా, రేడియో ప్రోగ్రాంలు విన్నా, టి. వి. కాలక్షేపం చేసినా రోజు గడవడమే దుర్భరమైపోతోంది.

గోకుల్ యెన్నోసార్లు బయటికి వెడతాడు. వెంట ఆమె వుంటుంది. తనని మాటవరుసకైనా రమ్మని పిలవడు. తాతగారు పెద్దకొడుకు ఇంటికి వెడతారు. ఆయినా పిలవరు. నాయనమ్మ ఏవో రెండు మాటలాడుతుంది. ఒక్కోసారి 'మీ అమ్మని చేసుకున్న ఆయన బాగుంటాడా?' అని అడుగుతుంది. ఆ మాట వింటేనే తేళ్ళూ జెర్రులూ పాకుతాయి. ఇంకెలా వింటాడు ఆమె కబుర్లు? 'వూం ఆం' లతో సరిపుచ్చి పుస్తకంలోకి తల దూర్చేస్తాడు.

నెహ్రూ కొద్ది కాలంలోనే విసిగిపోయాడు. అతనికి యీ మనుష్యులన్నా, వీళ్ళమధ్య లేని ఐకమత్యం చూసినా విసుగు పుడుతోంది. ప్రొద్దున్నుంచీ సాయంత్రంవరకూ చాలా హడావుడిగా వుంటారు. డబ్బూ, ఖర్చూ, జల్సా కనిపిస్తోందే కానీ కుటుంబంలో వున్న సభ్యులంతా కూర్చుని మాట్లాడుకోవడం వంటివి ఒక్కసారి కూడా చూడలేదు.

గోకుల్ చెప్పినట్లు సీజర్‌గానీ పీటర్‌గానీ ఎవరూ రాలేదు. ఇంత చిన్న విషయంలో అబద్ధం దేనికి? తనేమి ఫ్రెండ్స్ కావాలని కోరుకోలేదే? ఏమిటో... నెహ్రూకి అయోమయంగా వుంది. అంధఃకారంలోకి ప్రయాణం చేస్తున్నట్లు వుంది. అతని తల వేడెక్కిపోతోంది ఆలోచించి ఆలోచించి. కళ్ళు మూసుకున్న నెహ్రూ దృఢ నిశ్చయానికి

# ఊహాతీతమైన రంగులు
# ఉవ్విళ్ళూరించే డిజైన్లు
# మదురా బట్టలు కనులకు విందు

పోలియెస్టర్ మరియు పోలియెస్టర్ మిశ్రిత
బట్టలలోని విస్తృతశ్రేణి సూటింగులు, షర్టింగులు.

మదురా బట్టలు– తయారు చేయువారు

**మదురా కోట్స్**



డిస్ట్రిబ్యూటర్లు: మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ [ప్రై] లిమిటెడ్ 156, వస్త్రలత, విజయవాడ *** మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ [ప్రై] లిమిటెడ్, 7-3-710, రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాద్.

MCL-172 TEL

వచ్చేశాడు. ఆ తరువాత అతను విశ్రాంతిగా నిద్ర పోయాడు.

* * *

పబ్లిక్ స్కూల్లో ఫస్టు క్లాసులో పాసయ్యాడు నెహ్రూ. అతనికి మెట్రిక్‌లో మంచి మార్కులు వచ్చాయి. పేపర్లో నెంబరు చూసుకుని చాలా సంతోష పడుతున్నాడు. అతని స్నేహితులు అతన్ని భుజాలమీద ఎక్కించుకున్నారు. పార్టీ యివ్వమని గోల చేస్తున్నారు. అందరూ సంతోషంతో అభినం దనలు చెప్పేవారే. నెహ్రూకి జీవితం యిప్పుడు రంగు రంగుల పూలతోటలా కనిపిస్తోంది. ఆ తోటలో తనో సీతాకోకచిలుక మాదిరి విహరిస్తున్నాడు. అన్ని పూలనూ ముద్దాడేందుకు జీవితకాలం సరిపోదేమో అన్న బెంగ కూడా వుంది. యిప్పుడు అతనికి పదహారేళ్ళు. నూనూగు మీసాలతో ఆరడుగుల నాలుగంగుళాల పొడవుతో దృఢమైన శరీరంతో నెహ్రూ తెలివీ అందం కలగాపులగం చేసుకుని అందర్నీ ఆకర్షిస్తున్నాడు.

రావుగారు కార్లో వచ్చారు. ఆయన కారు హారన్ వినిపించగానే స్నేహితుల మధ్య నుంచి పరుగులాంటి నడకతో తాతగారిని చేరుకున్నాడు. ఆయన కారు దిగి రెండు చేతులూ చాపారు. ఆ చేతుల మధ్యకి వచ్చి ఆయన్ని గాఢంగా పెనవేసుకున్నాడు.

ఐదు నిమిషాలు యిద్దరూ మాట్లాడలేదు.



# డాక్టర్ వనిత

కొంచెంసేపటికి రావుగారు తేరుకున్నారు. 'పద మనం అలా కోఠీ వరకూ వెళ్ళివద్దాం.' అన్నారు.

కొంచెం ఆలోచించి 'పదండి' అని వచ్చి కూర్చున్నాడు.

కారు తారురోడ్డు మీద సర్రున దూసుకు పోతోంది. ఇద్దరూ పరిధి గీసుకున్నట్లు యెవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు.

నెహ్రూ క్రీగంట రావుగారిని చూస్తున్నాడు. ఆయన శరీరంలో దృఢత్వం తగ్గిపోయింది. చర్మం పూర్తిగా ముడతలుపడిపోయింది. ఆలోచించినా లేకపోయినా నొసటిమీద నాలుగైదు గీతలు పడుతున్నాయి.

నెహ్రూ జాలిగా చూస్తున్నాడు. అంతలోనే కఠినంగా మారిపోయాడు. తనకి యెవరున్నారు? యీ వృద్ధుడు తెరమరుగైపోతే తను యీ ప్రపంచంలో ఏకాకి కాక మరేమిటి? ఒంటరితనం గురించి ఆలోచించేందుకు భయంగా వుంది.

ఆ వేళ తను ధైర్యం చేసి వుత్తరం రాయకపోతే తన స్థితి మరే విధంగా వుండేదో?

తను యీ దేశంలోనే హైద్రాబాద్‌లోనే వుంటున్నట్లు కన్నతల్లికి తెలియనీయకుండా కట్టుదిట్టం చేసుకున్నాడు.

హైద్రాబాద్ చేరుకున్న వెంటనే రావుగారు కొన్నాళ్ళు స్నేహితుడి యింట్లో వుంచి అటు తరువాత పబ్లిక్ స్కూల్లో చేర్పించి తనని కంటికి రెప్పలా చూసుకున్నారు. ప్రతి సెలవులకీ బెంగుళూరు ఊటీ, మెద్రాస్, కన్యాకుమారి, ఒకటేమిటి? ఈ నాలుగైదేళ్ళల్లోనూ తనకోసం తన చదువు కోసం ఆయన పెట్టిన ఖర్చుకి లెక్కలేదు. ఆ చేతిలో డబ్బు మంచినీళ్ళప్రాయం అయిపోయింది.

[ఇంకా వుంది]



★ ★ ★ ★ ★ [illegible] రంగనాధ్, జయసుధ ★ ★ ★ ★ ★

# ★ సినిమా ★

## మంజుల ఆనందం

జగపతి ఆర్ట్ పిక్చర్స్ వారి "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రం నవంబర్ 15 న అన్నపూర్ణా స్టుడియోస్‌లో ప్రారంభమై, వరుసగా పక్షంరోజులు జరిగింది.

హీరో నాగేశ్వరరావు, హీరోయిన్ మంజుల పాల్గొన్న ఆరు నిమిషాల "డ్యాన్స్ సాంగ్" మొదటి మూడు రోజుల్లో చిత్రీకరించబడింది. స్పానిష్, రష్యన్, ఇండియన్ నృత్యాలను అక్కినేని...మంజుల పోటాపోటీగా అభినయించారు.

తర్వాత నాగార్జునసాగర్ వద్ద "లవ్ యీజ్ ఎ మస్ట్ ఫర్ ఆల్" అనేడి సోలోసాంగ్‌కు నాగేశ్వరరావు చూపెట్టిన "స్టెప్స్" ప్రేక్షకులకు ఫీస్టుగా వుంటుంది.

"బంగారుబొమ్మలు" సెట్లో మంజులను చూచి ఆశ్చర్యపోయిన ఎంతోమందిలో యీ విలేఖరి కూడా వున్నాడు.

ఆశ్చర్యానికి కారణం ...! స్లిమ్ముగా, బహు చక్కగా, పదుచుదనం బుసలుకొట్టే బొమ్మగా మంజుల సాక్షాత్కరించింది. ఆ నిజాన్ని ఆమెతో అన్నప్పుడు "రియల్లీ" అంటూ ఆనందాన్ని వ్యక్తపరిచింది.

"బంగారుబొమ్మలు" చిత్రంలో తను పోషిస్తున్న పాత్ర తన నట జీవితంలో మరపురానిదిగా నిలిచిపోగలదని, మంజుల యీ విలేఖరికి తెలిపింది.

"బంగారుబొమ్మలు" చిత్రం అందరినీ ఆకర్షించే అంశాలను గొనియున్న నిజాన్ని అక్కినేని అనేకసార్లు యీ విలేఖరికి చెప్పియున్నారు.

## గ్రేట్ ప్రొడ్యూసర్

కాస్ట్లీ చిత్రాలను నిర్మించడంలో, ప్రజలు మెచ్చేవిధంగా తన చిత్రాలను రూపొందించడంలో నిర్మాత ... దర్శకుడు రాజేంద్రప్రసాద్ "గ్రేట్" అని ప్రేక్షకులు ఎన్నోసార్లు తీర్పు నిచ్చారు.

"బంగారుబొమ్మలు" వర్ణ చిత్రం తెలుగు చలనచిత్ర చరిత్రలో రికార్డ్ కలెక్షన్లు తెచ్చిపెట్టగల అర్హతను పొందివున్నది.

### ఆలుమగల కేరళ పయనం

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అన్నపూర్ణా స్టుడియోస్‌లో నిర్మిస్తున్న వర్ణ చిత్రానికి "ఆలుమగలు" అని పేరు పెట్టారని గత వారం పాఠకులు చదివేవుంటారు.

"ఆలుమగలు"గా అగ్రద్వయం నటిస్తున్న పి. ఏ. పి. కొత్త చిత్రం షూటింగు డిశంబర్ ఒకట్నుంచి, పదిరోజులు కేరళ దేశంలో జరుగుతుందన్న వార్త పాఠకులకు కొత్తదే అవుతుంది.

అక్కినేని ... వాణిశ్రీ సమాన బలం గల పాత్రలను పోషిస్తున్న "ఆలుమగలు" చిత్రంలో గుమ్మడి, నాగభూషణం, రాజబాబు, కాకరాల, నారాయణరావు, లక్ష్మీకాంత్, జయమాలిని, రోజారమణి, రాజకుమారి, రమాప్రభ సహాయ పాత్రధారులు. తాతినేని రామారావు దర్శకుడు. చలపతిరావు సంగీత దర్శకుడు.

శ్రీ అనుమోలు వెంకటసుబ్బారావు పి.ఏ.పి. ని స్థాపించి యిరవై అయిదేండ్లు అయ్యింది. ఈ చిత్రం రజతోత్సవ చిత్రం అన్నమాట. "ఆలుమగలు" చిత్రం సిల్వర్‌జూబ్లీని చవిచూస్తుందికూడా.

### కృష్ణ సావాసగాళ్ళు

విజయా...సురేష్ నిర్మిస్తున్న "సావాసగాళ్ళు" వర్ణ చిత్రం కృష్ణగారి హిట్ లిస్టులో చోటుచేసుకునేది తథ్యము అనేది అభిప్రాయాన్ని, రషస్ చూచినవారు వెలిబుచ్చారు.

ఈ చిత్రంలో కృష్ణ చాలా హ్యాండ్‌సమ్‌గా, చురుకుగా, జలాకీగా, చిలిపిగా వున్నారు. ఆయన సరసన జయచిత్ర చేస్తున్న అల్లరి యువతరాన్ని ఆకర్షిస్తుంది.

"సావాసగాళ్ళు"గా గుమ్మడి, సత్యనారాయణ, మరొక జంటగా గిరిబాబు, ప్రభ, యింకొక జంటగా నాగేష్ ... రమాప్రభ నటిస్తున్నారు.

కొత్త దర్శకుడు బోయిన సుబ్బారావు పాత దర్శకుడివలె ప్రజ్ఞను, ప్రతిభను ప్రదర్శించే నిజాన్ని, అందరూ అంగీకరిస్తున్నారు. సంగీతం పట్ల కవి ఆత్రేయ, సంగీత సారధి రాఘవులు మంచి ఫలితాన్ని యిస్తున్నారు. "స్టార్ ప్రొడ్యూసర్" నాయుడుగారికి యిదికూడా హిట్.

### త్రిమూర్తి తర్వాతి చిత్రం

త్రిమూర్తి ప్రొడక్షన్స్ నిర్మించిన "భలేదొంగలు" వర్ణ చిత్రం ప్రేక్షకులను బలేగా ఆకట్టుకుంది. హీరో కృష్ణను అందరూ అభినందించారు. "పాడిపంటలు" చిత్రం తరువాత కృష్ణకు కమర్షియల్ హిట్ అయినచిత్రంకూడాయిదే.

త్రిమూర్తి ప్రొడక్షన్స్ అధినేతల్లో ఒకరైన బాబ్జీగారిని, యీ విలేఖరి తర్వాతి చిత్రం గూర్చి అడిగాడు.

జనవరి నుంచి ప్రారంభించాలని చెప్పారు. హీరోగా కృష్ణ తప్ప మరొకర్ని త్రిమూర్తి నిర్మాతలు యింతవరకు పెట్టలేదు ... యికముందు పెట్టరుకూడా.

ఈసారి "రీ...మేక్" చిత్రం వుండదని, సెంటిమెంటల్ స్టోరీని ఎంపికచేసే ఉద్దేశ్యం వున్నదని, బాబ్జీ చెప్పారు.



'చక్రధారి'లో ఒక దృశ్యం

# విశేషాలు *

### కన్య...కుమారి

సరిగమ ఆర్ట్స్, గడుసరి దర్శకత్వంలో డిశంబరులో ప్రారంభిస్తున్న వర్ణ చిత్రానికి "కన్య ... కుమారి" అని పేరు పెట్టారు.

మకుటం నిర్ణయించడంలో దాసరి కొక ప్రత్యేకమైన అభిరుచి వుంది.

కన్య ఏమిటి ? కుమారి ఏమిటి ? అని ప్రేక్షకుడు ఆలోచించడానికి సరిపడ్డ టైటిల్ ఇది.

ఈ "న్యూవేవ్" చిత్రానికి కథ, మాటలు, చిత్రానువాదం దాసరి సమకూర్చ, సంగీతాన్ని ఎస్. పి. బాలసుబ్రమణ్యం కూర్చడం విశేష అంశం కాగలదు.

ఈ చిత్రంలో పద్మప్రియ, జయమాలిని పోషించే పాత్రలు వాళ్లకు కొత్త యిమేజ్‌ను యిచ్చేవిగా వున్నాయి. నరసింహరాజు, శరత్‌బాబు, రమాప్రభ ముఖ్య పాత్రధారులు. ఈ చిత్రానికి టి. కాశీ, నారాయణరావు నిర్మాతలు. సాంబశివరావు నిర్వాహకుడు.

### సమత ఆర్ట్స్ కొత్త చిత్రం

"జేబుదొంగ" వర్ణ చిత్రం 12 కేంద్రాలలో శతదినోత్సవాన్ని (స్వయం శక్తితో) చవిచూచిన విజం, "నటరత్న" బహుమతీ ప్రదానం చేస్తూ ప్రశంసించిన విజం ప్రేక్షకులకు తెలుసు.

ప్రజానురంజకంగా చిత్రాలు నిర్మించే సంస్థల్లో సమత ఆర్ట్స్ ఒకటి. ఈ సంస్థను స్థాపించిన చటర్జీగారు ప్రజల పల్స్‌ను గ్రహించగల సమర్థులు.

సమత ఆర్ట్స్ తలపెట్టిన కొత్త చిత్రం జనవరి రెండున ప్రారంభమవుతుంది. ఈ భారీ వర్ణ చిత్రానికి "విక్టరీత్రయం" మధుసూదనరావు, వెంకటరత్నం, చక్రవర్తి వరుసగా దర్శకత్వాన్ని, ఛాయాగ్రహణాన్ని, సంగీతాన్ని నిర్వహిస్తున్నారు.

శోభన్‌బాబుగారిని "అందాల రాజా" అని ప్రేక్షకులు మనస్ఫూర్తిగా అంగీకరించారు. ముఖ్యంగా అందమైన ఆడపిల్లలు శోభన్‌బాబు చిత్రాన్ని ఆనందోత్సాహాలతో చూస్తున్న విజం అందరికీ తెలుసు.

సమత ఆర్ట్సువారి కొత్త చిత్రంలో శోభన్‌బాబు యింతవరకు వెయ్యని వేషాన్ని ధరిస్తున్నారు.

"నటుడుగా... రచయితగా" అందాల రాజా నటిస్తున్న సమత ఆర్ట్సువారి చిత్రంలో జయప్రద, రావు గోపాలరావు ముఖ్య పాత్రధారులు.

సమత ఆర్ట్సువారి కొత్త చిత్రం జనవరి రెండునుంచి, యిరవై మూడు వరకు (యిరవై నాలుగు రోజులు) జరుగుతుందని, నిర్మాత చటర్జీ గారు యీ విలేఖరికి చెప్పారు.

మరొక హీరోయిన్ పాత్రను, ఒక ప్రముఖ నటి పోషించగలదని కూడా ఆయన అన్నారు.

### డిశంబర్ 6 న అగ్నిజ్వాల

లోకేశ్వరీ ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో తలపెట్టిన "అగ్నిజ్వాల" చిత్రం డిశంబర్ ఆరున ఆరంభమవుతుంది. ఈ చిత్రంలో "అందాలరాజా" నటిస్తున్న పాత్ర ప్రేక్షకులను ఆకర్షించేది, నటుడుగా శోభన్‌బాబుకు కీర్తిని తెచ్చిపెట్టేదిగా వున్నది.

ప్రతి నటుడు అన్ని పాత్రలను సమాన ప్రేమతో పరిగణించడం కష్టసాధ్యమైన విషయం. కొన్ని పాత్రలు నటుడికి అనుభూతిని తెచ్చిపెడ్తాయి. ఆ కోవకు చెందిన ఉత్తమ పాత్ర "అగ్నిజ్వాల" చిత్రంలో శోభన్‌కు లభించింది.

శ్రీ ఎ. కె. వి. ప్రసాద్ నిర్మిస్తున్న యీ వర్ణ చిత్రానికి పి. ఎస్. రావ్ దర్శకుడుగా, చక్రవర్తి సంగీతకుడుగా, జి. కె. రాము ఛాయాగ్రాహకుడుగా, గోపి రచయితగా, ఎస్. కృష్ణారావు శిల్ప దర్శకుడుగా పదవీస్వీకారం చేశారు.

"అగ్నిజ్వాల" వర్ణ చిత్రంలో శోభన్‌బాబు, రామకృష్ణ, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, జయచిత్ర, సంగీత ముఖ్య పాత్రలను పోషించనున్నారని ప్రెస్ రిలేషన్స్ ఆఫీసర్ జగదీష్ చెప్పారు.



() () () () 'మంచిని పెంచాలి'లో జయలక్ష్మి, ఈశ్వరరావు () () () ()



'దేవుడున్నాడు జాగ్రత్త'లో జయకుమారి



'సావాసగాళ్లు'లో కృష్ణ, జయచిత్ర

అనాథ లెవ్వరు కాము మనం... ఆ
దేవుని కిక్కడ వారసులం."

ఎంతో ప్రయోజనాన్ని, జరుగుతున్న నిజాన్ని ఆత్రేయ కలం అందివ్వగా, బాలు ఎంతో గంభీరంగా, మరెంతో మధురంగా పాడారు.

"పాపులర్ దర్శకుడు" పి. చంద్రశేఖరరెడ్డి రూపొందించిన "పల్లెసీమ" చిత్రంలో ప్రతి పాట ఒక వెరైటీగా ఫీలయ్యే విధంగా మహదేవన్ కృషి చేశారు.

### సుధా ప్రియ !

"పల్లెసీమ" చిత్రంలో జయసుధ...సత్యప్రియ సమాన బలం గల పాత్రలను పోషించారు. గ్లామర్... చిలిపితనం... హాస్యం యొక్క ప్రతినిధిగా జయసుధ ప్రాముఖ్యత వహించింది. గ్లిసరిన్... ఆవేదన... అమాయకత్వం యొక్క ప్రతినిధిగా సత్యప్రియ రాణించింది.

ఈ విలేజ్ చిత్రంలో రంగనాథ్, శ్రీధర్, చంద్రమోహన్ హీరో పాత్రలను పోషించారు.

## సినిమా

### అంజలీ పిక్చర్స్‌కు ప్రత్యగాత్మ

ప్రేక్షకులు అభిమానించే కొద్ది సంస్థల్లో అంజలీ పిక్చర్స్ ఒకటి. ఈ సంస్థ ఎన్నో మంచి చిత్రాలను అందించింది.

ఎన్నో చక్కటి చిత్రాలను సృష్టించిన (భార్య భర్తలు, పునర్జన్మ, కులగోత్రాలు, మంచి మనిషి) ప్రత్యగాత్మగారిని అంజలీ పిక్చర్స్ అధినేతలు దర్శకుడుగా ఎంపిక చెయ్యడం ఎంతేని ఆనందదాయకంగా వుంది.

### కొత్తవాళ్లు !

అక్కినేనిగారు లేకుండా అంజలీ పిక్చర్స్‌వారు చిత్రాలు నిర్మించరు అని ఎన్నోసార్లు పాఠకులకు తెలిపింది, యీ కలం.

అందుకనే, కొత్తవాళ్లతో సినిమా తల పెట్టారు, అంజలీదేవి... ఆదినారాయణరావుగార్లు. ఈ చిత్రానికి సత్యానంద్ సంభాషణలు సమకూరుస్తున్నారు.

మంచి మనసున్న అంజలీదేవి... ఆదినారాయణరావుగార్లకు యీ కొత్త చిత్రం మంచి ఫలితాన్ని యివ్వగలదని యీ కలం నమ్ముతుంది.

### దేవుడి అమ్మ ఎవరు ?

మనందర్నీ సృష్టించిన ఆ దేవుడికి అమ్మ ఎవరు? నాన్న ఎవరు? అమ్మా నాన్నలు లేని దేవుడి మీద ఆచార్య ఆత్రేయ ఒక చక్కటి గీతికను వ్రాశారు.

శ్రీదేవి ఆర్ట్ పిక్చర్స్‌వారి "పల్లెసీమ" చిత్రంలో పాఠశాల పిల్లలకు, హీరో బోధించే పాఠంగా ఆత్రేయ గీతిక చోటు చేసుకుంది.

"పుట్టినవాళ్లకు తల్లి తండ్రి తప్పక వుంటారు
తెలిసి కొందరు తెలియక కొందరు అనాథ
లవుతారు
ఎవ్వరు కాదన్నా... ఎవరూ లేరన్నా... ఈ
సమాజమే మన తండ్రి భూదేవే
మా పల్లెని తల్లి



'విష్ణు విజయం'లో షీలా, కమల్‌హాసన్

ముగ్గురికీ పేరు తెచ్చే పాత్రలుగా కథకురాలు లలితాదేవి సంఘటనలను సమకూర్చారు.

దర్శకుడు రెడ్డి ప్రతిభ చిత్రం ఆద్యంతం అగుపిస్తుంది. ఎక్కడా "వేస్ట్" అనిపించకుండా, ప్రేక్షకుడికి వలసిన అన్ని రసాలను సమపాళ్లలో జొప్పించారు. నిర్మాతలు బలరామరెడ్డి, పరంధామిరెడ్డి.

ఈ చిత్రంలో గుమ్మడి, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, పద్మనాభం, మిక్కిలినేని, కె. విజయ, అపర్ణ, రాధాకిరణ్ సహాయ భూమికలను ధరించారు.

ఈ సంవత్సరం చివరి విభాగంలో వచ్చే యీ చిత్రాన్ని ప్రేక్షకులు వెరైటీగా అభిమానించి ఆనందిస్తారు. అన్నపూర్ణా ఫిలింస్ విడుదల.



'పల్లెసీమ'లో పద్మనాభం, గీతాంజలి

## సినిమా

### సుధ చేసిందా? ప్రభ చేసిందా?

శ్రీ లలితా మూవీస్ నిర్మిస్తున్న "ఇదెక్కడి న్యాయం" చిత్రంలో యిద్దరున్నారు. ఒకరు జయసుధ. ఇంకొకరు ప్రభ. రెండవఆమె తల్లిగా, మొదటామె కుమార్తెగా నటిస్తున్నారు.

ఈమధ్య తిరపతిలో పతాక సన్నివేశం చిత్రీకరించబడింది. "క్లయిమాక్స్" లో ఆర్టిస్టు లందరూ పాల్గొన్నారు.

తల్లిగా ప్రభ బాగా నటించిందా? కుమార్తెగా సుధ బాగా చేసిందా? అని యీ విలేఖరి ఒకర్ని ప్రశ్నించాడు. "ఇద్దరూ బాగా చెయ్యలేదు" అన్నాడా వ్యక్తి. అయితే రీ... టేక్ చేస్తారా అని అడిగింది యీ కలం.

"నో...నో! ఇద్దరూ నటించలేదు అన్నాను గాని, సహజంగా తల్లీ, కూతురువలె వున్నారని చెప్పడం మరిచాను, సుమండీ" అన్నాడా వ్యక్తి.

### ఇదెక్కడి న్యాయం?

శ్రీ లలితా మూవీస్ (జగదీష్ చంద్రప్రసాద్) నిర్మిస్తున్న "ఇదెక్కడి న్యాయం" చిత్రం మధ్యతరగతి కుటుంబాలలో జరుగుతున్న చరిత్రకు ప్రతిరూపంగా వుంటుంది. కుటుంబ బాధ్యతలను మోసే హక్కు మగాడికి ఎంత వుందో, స్త్రీకి కూడా అంతే వుందని చెప్పే చిత్రం "ఇదెక్కడి న్యాయం."

ఈ చిత్రంలో మురళీమోహన్, నరసింహరాజు, మోహన్‌బాబు, రావికొండలరావు, విజయకాంత్, జయసుధ, ప్రభ, నిర్మల, జయమాలిని ప్రధాన పాత్రధారులు.

అన్నపూర్ణా ఫిలింస్ ద్వారా విడుదలయ్యే దాసరిగారి మొదటి చిత్రం "ఇదెక్కడి న్యాయం."

సహజత్వం వున్న కథావస్తువు "ఇదెక్కడి న్యాయం" చిత్రంలో వున్నది గాబట్టి, అందరూ చూస్తారనడంలో అవుచిత్యం వుంది.



'అత్తవారిల్లు'లో ప్రభ, మమత

### జాన్సన్ ప్రత్యేకత

"నటసామ్రాట్"గారి చక్రవర్తి చిత్ర ద్వారా వెండి తెరను ప్రవేశించిన రచయిత మోదుకూరి జాన్సన్ తన కలం బలంతో కదుంగదు సమర్థుడు అని "మానవుడు – దానవుడు" చిత్రం ద్వారా ప్రూవ్ చేశారు.

ప్రేక్షకులు జాన్సన్‌గారి మాటలను పసిగట్టి, హర్ష ధ్వనులతో అభిమానించేంతటి వర్తమ చిత్ర చిత్రానికి పెంచుతున్నారు.

ప్రముఖ చిత్ర నిర్మాత రామానాయుడుగారి "సోగ్గాడు" చిత్ర విజయంలో జాన్సన్ కలానికి ప్రముఖ పాత్ర వున్న విజాన్ని ఎవరూ కాదనలేరు.

దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి, దర్శకుడు బాపయ్య మోదుకూరిగారి కలం మీద ప్రత్యేకత అభిమానం చూపెడుతున్నారు.

ప్రస్తుతం జాన్సన్‌గారు "సావాసగాళ్ళు, పల్లెసీమ, ఇంద్ర ధనుస్సు, ఒకే రక్తం" చిత్రాలకు మాటల రచయితగా వర్క్ చేస్తున్నారు. తెలుగు తెర గర్వించదగిన మంచి రచయితల్లో మోదుకూరి గారొకరు అన్నది యీ విలేఖరి అభిప్రాయం.

### ఫిబ్రవరి నుంచి గడుసుపిల్లోడు

శోభన్‌బాబుగారికి లభించిన మరొక మంచి చిత్రం "గడుసుపిల్లోడు." ఈ వర్ణ చిత్రంలో గంభీరత గల తండ్రి పాత్రను, అల్లరిచేసే కొడుకు పాత్రను శోభన్‌బాబు పోషిస్తున్నారు.

ఫిబ్రవరి యిరవై యెనిమిది నుంచి ప్రారంభమయ్యే "గడుసుపిల్లోడు" వర్ణ చిత్రాన్ని, రామకృష్ణారెడ్డి (రామకృష్ణా ఆర్ట్స్) నిర్మిస్తున్నారు.

వమూళ్ళ దర్శకుడు బాపయ్య దర్శకత్వంలో సింగారించుకునే యీ వర్ణ చిత్రంలో జమున, సత్యనారాయణ, దీప ముఖ్య పాత్రధారులు.

### ఇంద్రధనుస్సు

"వమూళ్ళ దర్శకుడు" బాపయ్య దర్శకత్వంలో ఉదయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న "ఇంద్రధనుస్సు" వర్ణ చిత్రం ఫిబ్రవరిలో జరిగే ఊటీ షెడ్యూలుతో పూర్తవుతుంది.

ఈ చిత్రంలో కృష్ణ, శారద ముఖ్య జంటగా నటిస్తున్నారు. ప్రధాన పాత్రలను కాంచన, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, శ్రీధర్, శరత్‌బాబు, సారధి, జయమాలిని పోషిస్తున్నారు.

నిర్మాతలు సుబ్బానాయుడు, సుధాకర్‌గార్లు యీ చిత్రం తాలుకు పాటలను వినిపించారు. విన్నవన్నీ (మూడు పాటలు) తీపి తీపిగా వున్నాయి.

"ఇంద్రధనుస్సు" వర్ణ చిత్రానికి మోదుకూరి జాన్సన్ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, భాస్కరరావు ఛాయాగ్రహణాన్ని, రామలింగం శిల్పాన్ని, మస్తాన్‌రావ్ సహకార దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

హీరో కృష్ణకు పేరును, నిర్మాతలకు డబ్బును తేగల చిత్రం "ఇంద్రధనుస్సు."

'సంసారంలో సరిగమలు'లో ప్రభ,రాజబాబు





'ప్రేమించి పెళ్ళి చేసుకో'లో ఒక సన్నివేశం

### మహేంద్ర మొదటి ప్రయత్నం

"ప్రేమించి పెళ్లి చేసుకో"— అంటుంది ఒక వర్గం. "పెళ్లి చేసుకుని ప్రేమించు"— అంటుంది మరో వర్గం. అసలింతకీ ఏది ఆమోదయోగ్యం, ఏది ఆచరణదాయకం అని చర్చిస్తే, సరైన సమాధానం దొరకదు. ఇలాంటి సందేహాలతో ఎందుకలా కాలాన్ని వృథా చెయ్యడం? ఈ మార్గాన్ని అనుసరించండి అంటూ, ఆ మార్గానుసరణలో గల సౌలభ్యాలు, సౌఖ్యాలు ఏమిటి అనే విషయాన్ని పాత్రల రూపేణ స్పష్టపరుస్తూ ఓ చిత్రాన్ని తయారు చేస్తున్నాడొక అభ్యుదయ నిర్మాత. చిత్రం పేరు "ప్రేమించి పెళ్లి చేసుకో" నిర్మాత పేరు కె. మహేంద్ర.

ఇప్పటికే చిత్రం ఏడు రీళ్లు పూర్తయింది. మూడు పాటల చిత్రీకరణ జరిగింది. నవంబర్‌లో మరో మూడు పాటల చిత్రీకరణ జరుగుతుంది. దాంతో చిత్రం మూడు వంతులదాకా పూర్తవుతుంది. కొంత పాచ్‌వర్క్ మాత్రమే మిగులుతుంది. అంటే మహేంద్ర చేపట్టిన ఈ తొలి ప్రయత్నం కాపుకొచ్చిందనేగా అర్థం.

నేటి యువతరాన్ని విపరీతంగా ఆకర్షించే కథాంశం గొన్న ఈ చిత్రం కె. హేమాంబరధర రావుగారి దర్శకత్వంలో మెరుగులు దిద్దుకుంటోంది. ఆదుర్తి నరసింహమూర్తి కథ, మాటలు, సత్యం సంగీతం, పార్థసారథి కెమెరా సమకూర్చే ఈ చిత్రంలో మురళీమోహన్, జయచిత్ర, సత్యనారాయణ, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, సారథి, కె. వి. చలం, సాక్షి రంగారావు, రమాప్రభ మూర్తి ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు.

### వాణీ కళాజ్యోతి ఫిలింస్

మదనపల్లిలో వెలసిన క్రొత్త చిత్ర నిర్మాణ సంస్థ వాణీ కళాజ్యోతి ఫిలింస్. కర్నాటక వాస్తవ్యులైన యం. వి. సోమశేఖర్, యం. వి. జయరామ్ స్థాపించిన ఈ సంస్థ ఓ చిత్రాన్ని తలపెట్టింది. చిత్రం పేరు "ప్రేమించిన హృదయాలు". చిత్ర రంగంలో పది సంవత్సరాల అనుభవాన్ని గడించిన యం. వి. సోమశేఖర్ కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం సమకూర్చే ఈ చిత్రంలో నూతన నటీ నటులతోబాటు కొందరు ప్రముఖ తారలు కూడా నటించగలరని తెలుస్తోంది. యం. వి. జయరామ్ నిర్మించే ఈ చిత్రం షూటింగ్ జనవరి నుంచి వుంటుంది.

### సత్యకు మాధవి జోడు

"అన్నదమ్ముల కథ" చిత్రం ద్వారా వెండి తెరకు పరిచయమైన సత్యేంద్రకుమార్, "తూర్పు—పడమర" చిత్రం ద్వారా ఆంధ్ర ప్రేక్షకులకు సన్నిహితమైన మాధవి జంటగా నటిస్తున్న ఆర్ట్ ఫిలింస్‌వారి "ఊరుమ్మడి బ్రతుకులు" చిత్రం షూటింగ్ భాగ్యనగరంలో చురుగ్గా సాగుతోంది. అక్టోబర్ 25వ తేదీ ప్రారంభమైన ఈ చిత్రం బి. యస్. నారాయణ దర్శకత్వంలో శరవేగంగా ముస్తాబవుతూంది. వెంకటార్య, జి. కె. మూర్తి నిర్మిస్తున్న ఈ చిత్రానికి ప్రముఖ నాటక రచయిత సి. యస్. రావ్ మాటలు వ్రాస్తున్నారు ప్రప్రథమంగా.

### ఆదిత్య చిత్ర రెండవ చిత్రం

"మనుషులంతా ఒక్కటే" వంటి విజయవంతమైన చిత్రాన్ని సమర్పించిన ఆర్ట్ డైరెక్టర్ రాజేంద్రకుమార్‌గారికి "నటరత్న" రామారావుగారు, వచ్చే సంవత్సరం మరో చిత్రం పని చేస్తానని మాట యిచ్చారు.

ఈసారి నవలా చిత్రాన్ని నిర్మించే వుద్దేశ్యం కుమార్‌కు వుంది. ఆదిత్య చిత్ర నిర్మించే రెండవ చిత్రంలో తను, తన తమ్ముడు మహేష్ మాత్రమే భాగస్వాములుగా వుంటారు.

రాజేంద్రకుమార్ రంగులు మార్చే మనిషి కాదు. ఆయనకు రామారావుగారంటే ఎనలేని భక్తి గౌరవాలు వున్నాయి. ఎన్టీఆర్‌గారు ఎప్పుడు కాల్‌షీట్లు యిస్తే, అప్పుడే ప్రారంభించడానికి కుమార్ సిద్ధంగా వున్నారు.

### జీవనరాగం

మారుతీ కంబైన్స్ నవంబర్ యిరవై ఆరున ప్రారంభించిన కొత్త వర్ణ చిత్రానికి "జీవనరాగం" అని పేరు పెట్టారు. ఈ చిత్రం యొక్క మొదటి పాట రికార్డింగు నవంబర్ 19న, జెమినీలో జరిగింది. ఆరుద్రగారు యిచ్చిన పాటను, సుశీల పాడారు. చక్రవర్తి సంగీతాన్ని సమకూర్చారు.

"జీవనరాగం" చిత్రంలో "రెబల్ స్టార్" కథానాయకుడుగా నటిస్తున్నారు. సహాయ పాత్రలను జగ్గయ్య, రావు గోపాలరావు పోషిస్తున్నారు.

అగ్రనటి, ద్వితీయ నటి నాయిక పాత్రలను పోషిస్తున్నారు.

ఎన్నో చిత్రాల అనుభవజ్ఞుడు, దర్శకత్వంలో ఎన్నో పాఠాలు నేర్చినవాడు, శక్తివంతుడు అగు శేఖర్ "జీవనరాగం" చిత్రాన్ని జనరంజకం చెయ్యగలడు.

— శ్రీనివాస్ ●

'అంతరం మనిషి'లో శోభన్, లక్ష్మి



# ధర్మం చర - సత్యం వద



మహమ్మద్ నఫీఉద్దీన్

''**ఊఁ** చెప్పు! చెప్పరా! చెప్పు! ఆ నగ, ఏం చేశావ్ ... దొంగ తొత్తు...''

... ... ... ...

ఇరవై యేళ్ళ సర్వీసులో, యిలాంటి పనుల్లో అపార అనుభవం గడించి, రాటుతేలిన మూడడుగుల పొడవూ — మూడంగుళాల వెడల్పూ వున్న ఆ లెదరు బెల్టు — ముప్ఫయి నిముషాల నుంచి ఆ వృద్ధుడి శరీరం మీద విలయతాండవమాడుతోంది.

అక్కడ గోడకున్న గాంధీ పటం — చుట్టూ గోడలకున్న ''ధర్మం చర'' ''సత్యం వద'' ''అహింసా పరమో ధర్మః'' అన్న ముక్కల్ని చూసి పరిహ సిస్తున్నట్లుంది. అక్కడ జరుగుతున్న హింసా కాండను చూడలేక క్యాలెండరుమీది బుద్ధుడు కళ్ళు మూసుకున్నట్టున్నాడు. ఎంతకీ ఏ సమాధానం రాకపోవటంతో హెడ్ కానిస్టేబిల్ నరశింహం నిజంగానే నరశింహమూర్తయ్యాడు.

బొమికెల గూడుమీద చింకి పాత తాటాకుల చాప కప్పినట్లున్న ఆ వృద్ధ నేరస్తుడి శరీరంలో — ముందు వాతల్లోంచి రక్తం చెమర్చింది. తరువాత రక్తం శరీరమంతా పులికినా — అతని నోట్లోంచి మాట మాత్రం బయటికి రావటంలేదు.

హెడ్‌కాన్‌స్టేబిల్ నరశింహం బెల్టు — కొమ్ములుతిరిగిన పాత కేడీలూ — రౌడీలచేతా — చివరికి మూగవాళ్ళచేత కూడా — లెక్కప్రకారం — మొదటి దెబ్బకే — మాట్లాడించింది. కానీ ఇవ్వాళ మొదటిసారిగా ఓడిపోయింది. అందుకే బ్రమీసాల నరశింహం ఖారాఖిల్లీ బుగ్గను దట్టించి, ఉక్కుముక్క పోతపోసి చేసిన పలుగులాంటి లాఠీ పైకి తీశాడు.

''అరేయ్! ముసలోడా! నిజం చెప్పు! ఆ పిల్లను చంపితే చంపావు! ఆ నగ ఏం చేశావో చెప్పు! అదెవతికో యిచ్చావు! యెవరికిచ్చావో తొందరగా చెప్పు! చెప్పరా! చెప్పరా...చెప్పవుగా— దొంగనా ...!'' అంటూ తన చేతి బలంకొద్దీ బలంగా మోదాడు. అంతే ఆ వృద్ధుడు పిడుగు పైనబడ్డవట వృక్షంలా నేల కూలాడు.

ఆ వృద్ధుడు పడ్డతీరు చూసి ఎందుకో మొదటిసారి భయం వేసింది నరశింహానికి. అదిరిపడి ముక్కుదగ్గర చెయ్యి పెట్టి చూశాడు.

''అమ్మయ్య! దొంగ నా కొడుకు — చావలా! సచ్చే పనయ్యేది!'' అని అనుకుని, గబగబ రిక్షా పిలిచి, గవర్నమెంటు హాస్పిటల్‌కు చేర్చాడు.

వృద్ధుడు కళ్ళు తెరిచి చూసేప్పటికి—చుట్టూ చీకటిగా వుంది. హాస్పిటల్‌లో అక్కడక్కడా వున్న చిన్న బెడ్‌లాంప్‌లు ఆరబోతున్న చితుల్లా వున్నయ్. తెల్లటి పరుపుల మీద ఎర్రటి దుప్పట్లు కప్పుకొని వున్న రోగులు రక్తపు ముద్దల్లా వున్నారు.

వృద్ధుడు తనకు ఎందుకు మెళకువచ్చిందో గుర్తు చేసుకునేప్పటికి దప్పికతో నాలిక పీక్కుపోతోంది ఏదో చెప్పాలనీ — కదలబోయిన అతనికి— అతని శరీరం తన స్వాధీనంలో లేనట్టు తెలిసింది.

ఎంతో శక్తి కూడగట్టుకొని ''దప్పిక! దప్పిక!'' అన్న అతని గొంతు వినడానికి అక్కడ నిద్రపోకుండా వుంది ఒక్క గోడగడియారమే.

వృద్ధుడు మళ్ళీ లేచే ప్రయత్నం చేశాడు. ఈసారి అతని చేతికీ — ఇనప మంచానికీ కలిపి వేసి వున్న బేడీలు — నొత్తుకున్నయ్. అప్పుడు గుర్తొచ్చింది — తనొక నేరస్తుడు — ఓ చిన్న బంగారు నగ కోసం... చిన్నపిల్లను పొట్టను పెట్టుకున్న హంతకుడు, లోకం దృష్టిలో. ఈ స్థితిలో వున్న నేరస్తుడు అసలు లేచి కూర్చోవటం అసంభవం. ఇక పారిపోవటం కల్ల. అందుకే నేరస్తుడికి కాపలా వుండవలసిన కాన్‌స్టేబిల్ వరండాలో గురక పెట్టి నిశ్చింతగా నిద్రపోతున్నాడు.

''దాహం! దాహం!'' అని ఎక్కడో కలల్లో కలవరించినట్టున్న వృద్ధుడి గొంతు, డ్యూటీలో 'శవసాహిత్యం' చదువుతూ చదువుతూ, నిద్రపోయిన నర్సమ్మకు వినబడలేదు.

ప్రాణం పోయేట్టు వుంది. తను బ్రతికి యిక వుద్ధరించేదేమిటి — అని ఓ ప్రక్క లోపల అనిపించినా — అప్రయత్నంగా అతనికి తెలియకుండా అతని గొంతు వొక్కసారి పైకి అరిచింది.

ఎవరో వ్యక్తి గ్లాసులో నీళ్ళు తెచ్చాడు — ''ఇదిగో తాతా...'' అంటూ నీళ్ళ గ్లాసు అందించబోయాడు. ఆ ప్రయత్నంలో దగ్గరగా వచ్చి చూసి అవాక్కయిపోయాడు, ఆ యువకుడు.

''అవును — అతనే... అతని ముఖం... ఆ గడ్డం... ఆ చింకిపాతల్లో... పబ్లిక్ గార్డెన్లో... యివ్వాళ వుదయమే... అంతమంది జనం... మూకుమ్మడిగా... భగవాన్... ఆ దృశ్యం... అప్పుడు...''

''చూస్తారేం యింకా! నరకండి! చంపండి!'' అంది ఓ గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ కసిగా.

''మార్డో సాలేకూ!'' అంది ఓ జర్దాఖిల్లీ రెచ్చిపోతూ.

''అడెడే రొంబా గోరమే!'' అంది ఓ 'అంబాళ్' నశ్యపు ముక్కు పళ్ళు నూరుతూ.

''అంత చిన్న పిల్లను — ఆ వెధవ నగ కోసం పొట్టను పెట్టుకున్నావట్రా నీ మొహమీద్చా!'' అంది, ఓ గంగా భగీరథీసమానురాలు మెటికలు విరుస్తూ.

''ఒరేయ్! రాక్షసుడా! నా బిడ్డ ప్రాణం ఆ చిన్న గొలుసుకోసం పొట్టనపెట్టుకున్నావా నువ్వు మనిషివి కాదు!'' అంది ఓ వ్యానిటీబ్యాగ్ తల్లి గుండెలు బాదుకుంటూ.

''పసిపిల్ల యిక్కడే వుందిగా — మరి నగేం అయినట్టు!'' బాధపడింది ఓ 'ఏగుమతి దిగుమతి' కంఠం.

"ఇంకా నగ వుంటుందా ! అదెప్పుడో దాచేసి వుంటాడు!" అన్నాడు ఓ కోర్టుపక్షి.

అంతే! మరుక్షణంలో ఆ టూరిస్టు బస్సులో అక్కడ పబ్లిక్ గార్డెన్ దగ్గర దిగిన వ్యక్తులు 'భిన్నత్వంలో ఏకత్వం' సాధించారు — ఆ బొమికల గూడును మోదటంలో అంతే !

"మారో ! కొట్టండి ! కిల్‌హిమ్ !"

మరుక్షణంలో ఆ పబ్లిక్ గార్డెన్ ప్రతిధ్వనించింది కోలాహలంతో.

ఈ కర్మకాండ అంతా, దూరంగావున్న పెద్ద పొదలాంటి చెట్టు వెనక నక్కివుండి చూస్తూ వింటున్న ఒకే ఒక వ్యక్తి, కన్నీరు కార్చకుండా వుండలేకపోయాడు — ఆ భీకర దృశ్యాన్ని చూస్తూ.

* * *

"ఎవరు బాబూ!" అన్నాడు వృద్ధుడు తన నోటి దగ్గరకు వచ్చిన నీళ్ళగ్లాసులో చుక్క గొంతులో దిగి, ప్రాణం కాస్త కుదుటపడగా.

ఆ యువకుడికి మళ్ళీ గుర్తొచ్చింది ... ఉదయం జరిగిన సంఘటన — ఆ పబ్లిక్ గార్డెన్‌లో — అనుకోకుండా తను నిద్రపోతున్న బల్ల దగ్గరకి యెవరో పసిపాప వంటరిగా రావటమూ — కళ్ళు తెరిచి చూసేప్పటికి ఆ పాప మెడలో — ఓ బంగారు నగ వుండటమూ — ఆ ... క్ష ... ణం ... లో ఆ బలహీనత ...

* * *

"బాబూ! నువ్వు! నువ్వు! ను...!!?" అంటూ తనను గుర్తుపట్టిన వృద్ధుడి మాటలకు మళ్ళీ హాస్పిటల్ వాతావరణంలో వున్నట్టు గుర్తు వచ్చింది యువకుడికి — యిప్పుడు అతని చేతిలో నీళ్ళ గ్లాసుంది — అవును తను వృద్ధుడికి నీళ్ళందిస్తున్నాడు. ఆ వృద్ధుణ్ణి, ఆ దీన స్థితిలో చూచి కళ్ళు చెమర్చాయి.

"ఎవరు తాతా నువ్వు! ఎందుకీ పని చేశావ్ ?" అడిగాడు ఓ ప్రక్క బాధను దిగ్మ్రింగుకుంటూ.

వృద్ధుడు నిర్లిప్తంగా నవ్వే ప్రయత్నం చేశాడు.

"ఈ నేరం నెత్తిన వేసుకోవటంవల్ల — నీకు పడబోయే శిక్ష ఏమిటో తెలుసా ?" వుండబట్టలేక మళ్ళీ అడిగాడు యువకుడు.

"తెలుసు బాబూ ! జీవితం చరమాంకంలో వున్నవాణ్ణి ! రిటైరైన హైస్కూలు మేష్టర్ని ! నేను యెక్కడున్నా యీ కట్టె రాలిపోయేంతవరకు నాకు కావలసింది పట్టెడు మెతుకులే బాబూ ! కానీ — నువ్వు — భావితరానికి ప్రతినిధివి — నీకు నూరేళ్ళ బ్రతుకు ముందుంది. తెలిసి చేసినా, తెలియక చేసినా — తప్పటడుగు తప్పటడుగే ! జరిగిందేదో జరిగిపోయింది—నీ పేరేమిటి బాబూ?" అడిగాడు వృద్ధుడు లాలనగా.

"భరత్ !" అన్నాడు యువకుడు అనాలోచితంగానే.

"భరత్ ! భ...ర...త్...ఎంత చక్కటి పేరు బాబూ ! ఏం బాబూ యింటర్వ్యూ రేసేనా ?" అడిగాడు వృద్ధుడు మళ్ళీ.

"ఇంటర్వ్యూ — నేను ... ఇంటర్వ్యూకి వెళ్ళవలసింది ! ?" అంటూ గొణిగాడు భయం భయంగా యువకుడు — అయోమయావస్థలోపడి.

అతనికి — ఆవేళ పబ్లిక్ గార్డెన్‌లో జరిగిన సంఘటనకు ముందు — తను వెళ్ళవలసిన సబ్‌యిన్‌స్పెక్టరు సెలక్షను ఇంటర్వ్యూని గురించి— తన తల్లి చావుబ్రతుకుల్లో హాస్పిటల్లో వున్న సంగతీ — తనలాంటి మరో నిరుద్యోగ మిత్రుడికి చెప్పుకున్నాడు. తరువాత కాస్సేపటికి ఆ మిత్రుడు వెళ్ళిపోయాక — అనాయితీగా, రోజూ పడుకునే సిమెంటు బెంచీమీద — మామూలుగా నిద్రకు వుపక్రమించాడు.

అంతలోనే అక్కడికి ఓ టూరిస్టు బస్సు వచ్చి ఆగినట్టుంది — అందులోంచి దిగిన ఓ చిన్న పాప ఆడుకుంటూ ఆడుకుంటూ తను నిద్రబోతున్న బెంచీ దగ్గరకు రావటం — తను మెలుకువ వచ్చి చూస్తే ఆ పాప మెడలోని ఖరీదైన బంగారు నగ — దానికి వ్రేలాడుతున్న లాకెట్‌లో పొదగబడ్డ ఖరీదైన రాళ్ళూ — అది తన ప్రస్తుతపు యిబ్బందికి — అవసరానికి వస్తుందని తన కనిపించటం — తాను ఆ గొలుసు తీసుకునే ప్రయత్నంలో ఆ పాప నోరు నొక్కటం — పాప భయంతో అరవబోవటం — అంతవరకు తను పడుకున్న బెంచీ వెనక వున్న ఎవరో వృద్ధుడు తనతో కలియపడ్డం — ఆ పెనుగులాటలో తను ఆ నగ తెంపుకు పారిపోవటం — ఆ పాప అచేతనంగా ఆ వృద్ధుడి చేతిలో... అలా ఉదయం పార్కులో జరిగిన సంఘటన ఓ సినిమా రీలులా అతని కళ్ళముందు తిరిగింది.

"అవును — ఆ వృద్ధుడే — ఆ గడ్డం —ఆ చింకిపాత చొక్కా — కాడల్లాంటి చేతులు — ఆ చేతుల్లో ఎంత బలం — అవును — అతనే... అతనే... అతనే యీ వృద్ధుడు!" అనుకున్నాడు యువకుడు మళ్ళీ మళ్ళీ.

"ఇక్కడ హాస్పిటల్‌కి ఎందుకొచ్చావు బాబూ ?" అడిగాడు వృద్ధుడు యువకుణ్ణి.

ఆ మాటల్లోని ఆత్మీయతా ప్రేమా — ఆ యువకుణ్ణి తను స్వార్థంతో చేసిన పనికి నిలువునా దహించివేస్తున్నాయ్.

"మా అమ్మ! మా అమ్మకు — నాకు — నా సర్టిఫికేట్లమీదా, మార్కు షీట్లమీదా లేని నమ్మకం — ఆమెకు ఎక్కువ! గోల్డు మెడలిస్టు నీకు ఎందుకు వుద్యోగం రాదురా! ఇదిగో యీ యింటర్వ్యూకు వెళ్ళు... ఇదిగో యీ యింటర్వ్యూకి వెళ్ళు అంటూ — చివరికి ఏమీ అమ్ముటానికి మిగలక తన శరీరంలో రక్తాన్ని అమ్మి అమ్మి... యిప్పుడు అదే రక్తం... శరీరంలో లేక... మృత్యువుతో పోరాడుతూంది తాతా!" అన్నాడు బాధగా. ఓ క్షణం యిద్దరి మధ్యా నిశ్శబ్దం ఆవరించింది.

"చూడు బాబూ భరత్! నీలాంటి యువకులే యిలా నిరాశతో తప్పటడుగువేస్తే యిక యీ జాతికి భవిష్యత్తులేదు బాబూ!" అన్నాడు బాధగా వృద్ధుడు.

యువకుడు నిశ్శబ్దంగా నరకయాతన అనుభవిస్తున్నాడు మానసికంగా.

"బాబూ! నువ్వు వెళ్లదలచుకుందీ— సబ్‌యిన్‌స్పెక్టర్ వుద్యోగానికేనా ?" అడిగాడు వృద్ధుడు.

"ఆ ఉద్యోగ ధర్మం తెలుసుగా బాబూ!" మళ్ళీ అడిగాడు.

"తెలుసు తాతా !"

"ఏమిటి బాబూ అది ?"

"నిర్దోషుల్ని కాపాడి దోషుల్ని శిక్షించేట్టు చూడ్డం!"

"చూడు బాబూ! నువ్వు సదాశయంతో చెయ్యదలచిన ఆ మంచి పని — నీ చేతులమీదుగా నువ్వు చేసే శక్తి నీకు రావాలంటే — యీ నేరానికి నేను సమిధను కాక తప్పదు. నీలాంటి ఆదర్శ యువకులే — నీతీ నిజాయితీకోసం ప్రాకులాడే యువకులే బాబూ — యిప్పుడు కావలసింది. ఇప్పుడు మనం వున్న పరిస్థితుల్లో నీకు — యీ నేరానికి నేను శిక్ష పొందటంకంటే మరోవిధంగా సాయం చేయలేను." అన్నాడు వృద్ధుడు సంతోషంగా.

యువకుడి కనుకొలకుల్లోంచి కన్నీరు ధారాపాతంగా కారిపోతున్నది.

"బాబూ భరత్! నేను ఎవరో నీకు తెలియదు — నువ్వు యెవరో నాకు తెలియదు. మనం ఒకరికి ఒకరం ఏం కాము. కానీ మనం మనుషులం! ఓ వేళ నీ సబ్‌యిన్‌స్పెక్టరు యింటర్వ్యూ జయప్రదమయి — నువ్వే చట్టాన్ని కాపాడే అధికారివయితే — తప్పక నిర్దోషుల్ని కాపాడుతావుకదు బాబూ!" అన్నాడు వృద్ధుడు మళ్ళీ.

"తాతా! నన్ను చట్టం కాపాడమంటూ — యీ దోషిని నిర్దోషిని చేస్తూ — నువ్వు నిర్దోషివి దోషిగా మారటం న్యాయమా ?" అన్నాడు బాధగా యువకుడు.

"తప్పులేదు బాబూ! పదిమంది మేలుకోసం, ఒక్కడు నష్టపడ్డా తప్పులేదు. ఇదిగో ప్రమాణం చెయి బాబూ — నువ్వు ఓ వేళ చట్టాన్ని కాపాడే అధికారివైతే — ఏవిధమైన ప్రలోభాలకీ లొంగక నిర్దోషుల్ని కాపాడుతావుగదూ!" అడిగాడు వృద్ధుడు నిశ్చలంగా.

యువకుడు మారు మాట్లాడకుండా తన చెయ్యి వృద్ధుడికి అందించాడు. మరుక్షణంలో వృద్ధుడి కళ్ల నుంచి రెండు కన్నీటి బిందువులు ఆ యువకుడి చేతిమీద పడ్డాయ్.

* * *

"హలో! నేను సబ్‌యిన్‌స్పెక్టర్... ఆ ఎవరూ... డివైఎస్పీగారా గుడ్‌మార్నింగ్ — సార్ ! సా...ర్... ఆ... ఇంకా తయారుచేయలా... ఆ... అలాగే సార్..., ఆ స్టూడెంట్‌ని... విడిచిపెట్టేయమంటారా... అలాగే... ఆ... ఇప్పుడే వదలివేయమంటాను... ఆ... ఆ... పంపండి సార్... మాట్లాడుతాను... ఆ... ఆ... వుంటాను సార్!" అంటూ ఫోను పెట్టేశాడు.

పైన సీలింగు ఫాను తిరుగుతున్నంత వేగంగా అతని మెదడులో ఆలోచనలూ తిరుగుతున్నాయ్. నిర్దోషులను సంరక్షించి దోషులను శిక్షించవలసిన తను — 'భగవాన్' అనుకుని బాధగా కళ్ళు మూసుకున్నాడు. "నమస్కారమండీ!" అన్న సైరన్ లాంటి కంఠం విని కళ్ళు తెరిచాడు.

ఎదురుగా పాత పోసిన ఖడ్గమృగంలా వున్న

ఖద్దరు లాల్చీవాలాని చూసి — ఎవరో అర్థం కాక — "ఎవరు ?" అన్నట్టు చూశాడు యిన్‌స్పెక్టర్.

"దొరగారు ఫోన్ చేసి చెప్పారనుకుంటా! ఓసారి మిమ్మల్ని చూడమన్నారు !" అన్నాడు — లేని నవ్వు ముఖం మీదికి తెచ్చుకుంటూ.

"అయితే ఆ వాచర్‌ని పొడవబోయిన అబ్బాయి ?" యింక ఎలా పూర్తి చేయాలో తెలియక సందిగ్ధంగా వుండిపోయాడు — యిన్‌స్పెక్టర్.

"మా వెధవే! అయినా — వాళ్ళూ వీళ్ళూ అనుకోవటమేగానీ మావాడు వాచర్‌ని ఎక్కడ పొడిచాడు !" అన్నాడు అదేమంత తప్పు కాదనట్టు ఖద్దరు శాస్త్రి.

"అయితే ఆ ముసలాణ్ణి ఎవరు పొడిచారు ?" అడిగాడు కొంచెం కోపంగా ఇన్‌స్పెక్టర్.

"అదే మీరు చేయవలసిన పని! అందుకేగా వచ్చింది — అదే యీ కేసు తాలూకు చార్జి షీటు విషయంలో మీరు కాస్త దయతలిస్తే!" నసిగాడు ఖడ్గమృగం.

"నేను సరే! మరి ఆ వాచరుగా పని చేసిన లెక్చరరూ — ప్రిన్సిపాల్ !" తన అనుమానం వ్యక్తం చేశాడు యిన్‌స్పెక్టరు.

"వాళ్ళు మాత్రం మనుషులు కాదా ! ఇద్దరికీ ప్రమోషను ప్రామిస్ చేసేసరికి — మనకు అనుకూలంగా ప్లేటు ఫిరాయించారు. బయట నా కార్లో వున్నారు యిద్దరూ — పిలవమంటారా ?" అన్నాడు నవ్వుతూ.

"అయితే !..." ఏమి చెప్పాలో అర్థం కాలేదు ఇన్‌స్పెక్టర్‌కి.

"ఇంకా అయితే గియితే వేరు ! అయినా మావాడు పొడిచింది ఓ ముసలి ఖైదీని—మావాడే—ఆ ఖైదీగాడు వాచరును కత్తితో పొడవబోతే అడ్డుపడి వాచరు ప్రాణాలు కాపాడాడు అన్నట్టు రికార్డు తయారు చేయవయ్యా !" అన్నాడు ఖడ్గమృగం నవ్వుతూ.

"ఇది మరీ అన్యాయం సార్ !" ఇన్‌స్పెక్టరు బాధగా ముఖం తుడుచుకున్నాడు చెమట కారిపోతుండగా.

"ఏదేం పోయిందయ్యా మధ్యలో — నా బాధపడతావ్ — అయినా యింతాచేసి మా కాపాడదామనేది చావబోతున్న ముసలి ఖైదీనా. నే చెప్పినట్టు చార్జిషీటు తయారుచెయి, రేపొద్దుటికి ప్రమోషను లిస్టులో నీ పేరు చేర్పిస్తా ! వస్తా — ఓమాట ప్రాసిక్యూటరుకూ చెప్పిరావాలి — ఆ మావాడికోసం కారు రడీగా వుంది — త్వరగా పంపించేయ్ !" అంటూ అక్కడినుంచి పాపంలా కదిలాడు.

ధారాపాతంగా కారుతున్న చెమటనీ — అంతకంటే వేగంగా కొట్టుకుంటున్న గుండెనీ, దిమ్మెక్కి మొద్దుబారిపోతున్న ఆలోచనల భారానికి తట్టుకోలేక — తను యీ ఉద్యోగంలో ఎందుకు చేరాను భగవంతుడా అని తనని తాను — లక్షోసారి తిట్టుకున్నాడు — యిన్‌స్పెక్టర్.

ఇంతలో ఫోను గణగణ మోగింది.

"హలో !" అన్నాడు ఫోనెత్తి.

క్షణంలో అతని ముఖంలో రంగులు మారాయి.

"ఆ ... ఆ ... యిప్పుడెలా వుంది ఖైదీకి ...

## ధర్మం చెర సత్యం వధ

ఆ...ఎమర్జెన్సీ ఆపరేషను చేస్తున్నారా...కండిషను చాలా ప్రమాదకరంగా వుందా ... ఏ వార్డు ... బీ వార్డు ... డౌన్ ఫ్లోరేగా ... ఆ ... ఆ ... ఇప్పుడే వస్తున్నా" అంటూ జీప్‌లో బయలుదేరాడు.

* * *

ఆ గవర్నమెంటు హాస్పిటల్ ఎమర్జెన్సీ వార్డు ముందు జీప్ ఆగగానే — సరిగ్గా — యిలాంటి హాస్పిటల్‌లోనే — యిలాంటి రాత్రే — తన తల్లి — చావుబ్రతుకుల్లో ... అనుకున్నాడు యిన్‌స్పెక్టర్ జీపు దిగుతూ — నాలుగేళ్ల క్రితం జరిగిన సంఘటన గుర్తుచేసుకుంటూ.

"ఇటు సార్ !" అన్న పోలీసు శాల్యూట్‌తో అతను చూపుతున్న మార్గంవైపు నడిచాడు. దారిలో అడిగాడు "అసలేం జరిగింది ?" అంటూ.

పోలీస్ కాన్‌స్టేబిల్ ఏదో సమాధానం చెబుతున్నట్టున్నాడు తన ప్రశ్నకు. కానీ యిన్‌స్పెక్టర్ సరిగా వినక మళ్లీ అడిగాడు. పోలీసు చెబుతున్నాడు —

"రాజమండ్రి సెంట్రలు జైలు నుంచి యిద్దరు ఖైదీలు ఇంటర్ పరీక్షలు వ్రాయటానికి గాంధీ కాలేజీకి వచ్చారు సార్. అందులో అసలు పరీక్ష వ్రాసేవాడు గుడ్డివాడు. వాడు చెప్పింది పరీక్షలో వ్రాయటానికి సహాయకుడుగా వచ్చింది



ఓ ముసలి ఖైది. ఓ హాల్లో విద్యార్థులు పరీక్ష వ్రాస్తున్నారు మామూలుగా. బయట వరండాలో ఓ బల్ల విడిగా వేసి వీళ్ళిద్దరినీ పరీక్షా కార్యక్రమానికి అనుమతించారు. ఖైదీలు గదా — అందుకని, వీళ్ళిద్దరికీ బయట నేను కాపలా వున్నాను.

ఇంతలో లోపల హాల్లో ఎవరో స్టూడెంట్ కాపీ కొడుతుంటే వాచర్ పట్టుకున్నాడు. దాంతో ఆ స్టూడెంట్‌కీ వాచర్‌కీ మధ్య గొడవ ప్రారంభమయింది. ఆ స్టూడెంట్ తాగి వున్నట్టున్నాడు వాచర్‌మీద తిరగబడి కొట్టే పైన కలబడ్డాడు.

ఈ గలాభా విని బయట వున్న వృద్ధ ఖైదీ లోపలికి వెళ్లాడు. ఆ విద్యార్థికి నచ్చచెప్పి విడతీసి పోట్లాట సర్దబోయాడు. అంతే ఆ విద్యార్థి తాగిన మైకంలో రెచ్చిపోయి కత్తితో ఆ వృద్ధుణ్ణి గుండెల్లో పొడిచాడు. ఇదంతా వరండాలో వున్న నేను కళ్ళారా చూశాను... "కానీ... కానీ...!" అంటూ నసుగుతూ ఆపాడు పోలీసు.

"ఏమిటీ !" అన్నాడు యిన్‌స్పెక్టర్ ఆపరేషను థియేటరు ముందు ఆగుతూ.

"ఇందాక పెద్ద దొరగారు పిలిపించి మరో విధంగా రిపోర్టు వ్రాసి యిమ్మన్నారు సార్... తమకూ... !" అని నీళ్ళు నమిలాడు.

"షటప్ !" అన్నాడు యిన్‌స్పెక్టరు కోపంగా— కానీ అతనికీ తెలుసు కేసు చార్జిషీటు పై అధికారి అధికారానికి లోబడి ఎలా తయారు చేయవలసి వుంటుందో. ఇంతలో ఆపరేషను థియేటరు బయట బల్లమీద కూర్చుని వున్న ఓ గుడ్డివాడు కనిపించాడు. అతని చేతికి బేడీలు వేసివున్నయ్ — ప్రక్కన ఒక పోలీసు నిలబడి శాల్యూట్ చేస్తున్నాడు తనను చూసి "ఇతనే సార్ ! పరీక్ష వ్రాయటానికి రాజమండ్రి నుంచి వచ్చింది !" చెప్పాడు పోలీసు — ఆ గుడ్డి ఖైదీని చూపుతూ.

"ఇతనికి నిజంగా జరిగిందంతా తెలుసు ! కానీ గుడ్డివాడి సాక్ష్యం కోర్టు అంగీకరించదు. కానీ కళ్ళుండి నిజం చూసినవాళ్ళు — ఆ నిజం చెప్పటానికి వీల్లేని పరిస్థితి" — అనుకున్నాడు యిన్‌స్పెక్టర్ బాధగా.

ఇంతలో ఆపరేషను థియేటర్ తలుపు తెరుచుకొని ఓ డాక్టర్ వచ్చాడు.

"గుడ్ మార్నింగ్ సార్ !" అన్నాడు యిన్‌స్పెక్టరు విష్ చేస్తూ.

డాక్టరు బాధగా నవ్వటానికి ప్రయత్నంచేశాడు.

"సారీ మిస్టర్ భారత్ ! మా శాయశక్తులా ప్రయత్నించాం కానీ మీ ముసలి ఖైదీని కాపాడలేకపోయాం ! బైదిబై ఆ పెనుగులాటలో — అదే దయానిధిగారి అబ్బాయికి మల్టిపుల్ యింజరీస్ — దాంతోపాటే రైట్‌హ్యాండ్ ఫ్రాక్చరైనట్టు సర్టిఫికేట్లు కావాలన్నారు వారు. ఆ కేసు చార్జిషీటు కాస్త జాగర్తగా తయారుచేయండి ! బై ! బై !" అన్నాడు వెళ్తూ వెళ్తూ,

అంతవరకు ఆపరేషను థియేటరు బయట వున్న బల్లమీద కూర్చున్న గుడ్డి ఖైదీ — యీ మాటలు విన్నట్టున్నాడు.

"ఎలావుంది సార్ మా మేష్టరుగారికి !" అని తను విన్న వార్త నమ్మలేక — నమ్మకం కుదరక ఆతురతగా లేచినస్తూ అడిగాడు యిన్‌స్పెక్టరును వుద్దేశించి.

ఇంతలో స్ట్రెచర్‌మీద, ఆపాదమస్తం తెల్లటి గుడ్డ కప్పిన ఆకృతిని, ఆపరేషను థియేటరు నుంచి బయటకి తెచ్చారు.

"ఆగండి ! ఆ శవాన్ని ఆ గుడ్డివాడి దగ్గరికి తెండి !" అరిచాడు యిన్‌స్పెక్టరు కోపంగా.

స్ట్రెచర్ గుడ్డివాడి ముందు ఆగింది. గుడ్డివాడు తడుముకుంటూ మెల్లిగా శవంమీది దుప్పటి కొద్దిగా తొలగించాడు ... అతని చేతులు మెల్లిగా వెతుకుతూ ఆ చల్లటి పాదాలను స్పృశించాయి. దాంతో అతని దుఃఖం ఆగిందికాదు.

"వెళ్లిపోయారా మేష్టరూ ! నన్ను ఒంటరివాణ్ణిచేసి వెళ్లిపోయారా ! మీరు లేని పరీక్షలు యీ గుడ్డివాడికి ఎందుకు — పదిమందికి మేలు చేయటానికి ఒకడు నష్టపడ్డా పర్వాలేదని నిరూపించటానికి — మీరు ... !" అంటూ కన్నీరు మున్నీరుగా విలపించసాగాడు గుడ్డివాడు.

అతని దుఃఖాన్ని చూసిన అక్కడివాళ్లకు దుఃఖం ఆగిందికాదు. వాళ్ళూ సానుభూతిగా కన్నీరు తుడుచుకున్నారు.

స్ట్రెచర్ కదలబోతూంది. గుడ్డి ఖైదీ యింకా ఆ శవం కాళ్ళు విడిచిపెట్టటంలేదు. ఈ పెనుగులాటలో వృద్ధుడి ముఖం యిన్‌స్పెక్టర్ కంటపడింది — అతని శరీరం ఒక్కసారి కంపించినట్టయింది — అప్రయత్నంగా "మాష్టరూ !" అన్నాడు ఆ శవాన్ని గుర్తుపడుతూ. ●

# జీవన్ టోన్ 20 వ శతాబ్దపు ఆరోగ్య టానిక్



రెండు సీసాలు ఉపయోగించిన తరువాత    నాలుగు సీసాలు ఉపయోగించిన తరువాత

అజీర్ణం, బలహీనం, నిద్రలేమి, బరువుతగ్గడం, ఆకలి లేకపోవడం తగ్గిపోయేటట్లు చేసే పిల్లలు, పెద్దలు కూడా వాడదగిన ఆదర్శ టానిక్. 3 లేక 4 కిలో గ్రాముల జీవన్‌టోన్ మాత్రమే మీకు కావలసిన బరువు, ఆరోగ్యం ఇస్తుంది. ఇది జంతు కొవ్వులు కలిపినది అనీ, అందుచేతనే త్వరగా బరువు, ఆహారం ఎక్కువ అవటానికి సహాయం చేస్తుందనీ కొందరికి అనుమానాలున్నాయి. వారికి దీంట్లో కాయగూరల క్రొవ్వు, అరుదైన మూలికలు మాత్రమే ఉన్నాయని చెప్తున్నాం.

కావలసిన బరువు వచ్చింతర్వాత ,మందు తీసుకోవడం ఆపివెయ్యాలి.

## *450 గ్రాముల మందు వెల రూ. 14-00*

సెట్ బాటిల్ మరియు సెల్ఫ్‌పౌడర్ (మగవారికి మాత్రమే) రు. 20–00.

స్కిన్‌టిన్ : మొటిమల్ని మాన్పి, ముఖాన్ని అందంగాను, కాంతివంతముగాను చేస్తుంది.

2 అవున్సుల మందు రు. 15/- జీవన్‌టోన్ ప్రొడక్ట్సు కొరకు ఈ క్రిందిస్టాకిస్టులను సంప్రదించండి:

★ నెల్లూరు : కె. యస్. రావు & సన్సు. ★ కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. ★ సూర్యారావుపేట : జమ్మిచెట్టు సూర్యనివాస్. ★ సికింద్రాబాద్–3 : టి. హెచ్. పరేక్ & కంపెనీ, సుభాష్ రోడ్డు, జావమ్మ మసీదు దగ్గర. ★ సికింద్రాబాద్ : శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. ★ గుంటూరు–1 : ఆంజనేయ మెడికల్స్, జిన్నాటవర్ దగ్గర, ట్రాంకు రోడ్డు. ★ విజయవాడ–1 : సూర్యామెడికల్ స్టోర్సు, పార్కు రోడ్డు. ★ విజయవాడ 3 : శ్రీ ధనలక్ష్మీ మెడికల్ స్టోర్స్. ★ అనకాపల్లి : కొమ్మమంచి అప్పలరాజు, మెయిన్ రోడ్డు. ★ హైదరాబాద్–1 : అంబుర్షాన్ మెడికల్ హాల్, కోటి బస్‌స్టాండ్ ఎదుట. ★ హైదరాబాద్ : వసంత్ మెడికల్ స్టోర్స్, 4–4–293, బ్యాంక్ రోడ్. ★ శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ & సన్సు, పాలకొట్టు స్ట్రీట్. ★ విజయనగరము : భట్టుల లింగప్రసాద్‌రావు, మెయిన్‌రోడ్డు. ★ విశాఖపట్నం : సిరిపో & కంపెనీ, ఎ.ఎ.ఎస్. కాలేజిరోడ్డు. ★ మదనపల్లి: హయగ్రీవ్‌ షాప్, 6/77–నెహ్రూ స్ట్రీట్. ★ రాజమండ్రి : ఈశ్వరదాస్ & కంపెనీ, జైహింద్ బిల్డింగుదగ్గర. ★ సికింద్రాబాద్ : సూర్యామెడికల్‌హాల్, జవహ్మామసీదు. ★★★ ఆంధ్రా స్టాకిస్టులు అందరు మా పోల్ డిస్ట్రిబ్యూటర్సును దయవుంచి సంప్రదించండి : మెస్సర్స్ అక్మేటెడ్ ఏజన్సీ, పి.బి. నెం. 116, పులిపాటివారి స్ట్రీట్ విజయవాడ–1, (ఎ. పి.). కర్నాటక స్టేట్ : బెంగుళూరు–1 : జనతా మెడికల్ స్టోర్స్ శివాజీనగర్, బస్‌స్టాండు ఎదుట. ★ బెంగుళూరు 2A, : సిటీ మెడికల్స్ అండ్ జనరల్ ఏజన్సీస్ చిక్‌పేట్. ★ మాంగళూర్ : శారద ఎంటర్‌ప్రైజెస్ 1–727 టెంపుల్ రోడ్డు. ★ హాస్సన్ : శ్రీ కృష్ణ స్టోర్సు, సుభాష్ స్క్వేర్. ★ షిమోగా : ది మైసూరు మెడికల్ స్టోర్సు, బి. హెచ్. రోడ్డు. ★ సాగర్ : శ్రీ మల్లికార్జున స్టోర్స్, మహాలక్ష్మీ స్టోర్స్. ★ ఉడిపి : మైసూర్ ఆయుర్వేదిక్ మెడికల్స్ శంతకట్టు. కుమ్‌టా : కుమ్‌టా పార్మసీ, కార్ స్ట్రీట్. ★ తమిళనాడు మరియు మహారాష్ట్ర మద్రాసు–3 : కమల కాఫీ వర్క్సు, 18, పూందమల్లి హైరోడ్డు. ★ బొంబే–9 : మలబార్ మెడికల్ హాల్ 24, బక్రియా మసీదు స్ట్రీట్. ★ బొంబే–28: జయంతి జనరల్ స్టోర్సు, దాదర్ స్టేషన్ ఎదుట.

ఈ క్రింది అడ్రస్‌కి వి. పి. పి. కొరకు వ్రాయండి.

Manu facturing Licence No. A.V.S. 59/75

TRADE  MARK

Regd No.218726.

## జీవన్ టోన్ ప్రొడక్ట్సు

పి.బి నెం. 880, 17/1 కెం బిల్డింగ్స్, బజార్ బెంగుళూర్–560008

గొప్పేగ! కాలేజీ దగ్గర తన స్నేహితురాళ్ళు వాణీ, శైలా కూడా అడుగుతారు ఎవరికారని! మాదే! నా పెళ్ళి నిశ్చయమైంది. ఇది మా ఉడ్ బీ కారు.' అని గర్వంగా చెప్పుకోవచ్చు అనుకునేగా పెళ్ళికి రెండో ఆలోచన లేకుండా వొప్పుకుంది! ...కానీ...కానీ.. తీరా తను కోరుకున్న వన్నీ వరసవారీగా కళ్ళెదుట కని పిస్తూంటే వాటి అవసరమే లేదనిపిస్తోందేం! అందుకే దూరపు కొండలు నునుపనే సామెత వచ్చింది కాబోలు!' ఆలోచనలతో తల భార మెక్కి పోయింది.

సాయంత్రం ఉదయ్ అడిగాడు. "కారు పంపిస్తే వద్దన్నావుట. ఎందుకు సంధ్యా?"

"కాలేజీ దగ్గరేగా ! అందుకని..." నసిగింది సంధ్య.

"పోనీ. దానికి బదులుగా ప్రతి సాయంత్రం నాతో షికారుకి రావాలి" అన్నా డతను. సంధ్య నిస్సహాయంగా తల ఊపింది.

"ఇది సాయంత్రమేగా! కారెక్కు మరి!" ఉదయ్ ముందుకి దారి తీయడంలో అత న్ననుసరించింది. కారు విశాలమైన వీధుల వెంట సాగిపోతూంటే ఉదయ్ అన్నాడు.

"సంధ్యా! ఇలాటి సంధ్యా సమయంలో ఇలా నీ ప్రక్కన కూర్చుని చల్లగాలిలో షికారుకి వెళ్తూంటే ఎంత బాగుందో తెలుసా! ఇలాగే గమ్యంలేని బాటసారుల్లా జీవితాంతం సాగిపోవాలని లేదూ!"

సంధ్య తత్తరపడింది. 'సరిగ్గా తను లక్ష్మణ్‌తో కలిసి వెళ్ళేటప్పుడు కోరుకున్న కోరిక !

## ఆమెకేం కావాలి ?

(18వ పేజీ తరువాయి)

"అన్నట్లు గీత మా మహేష్‌కో బుల్లి పాపాయి నివ్వబోతోంది. త్వరగా మన పెళ్లి అయిపోయి ఓ పాపో. బాబో పుడ్తే..." ఉదయ్ ఏదో అనబోతూంటే, "ప్లీజ్ ! ఇప్పుడవన్నీ ఊహించవద్దు. మరేదైనా మాట్లాడండి" అంటూ అడ్డు వచ్చింది సంధ్య.

ఉదయ్ గంభీరంగా మారిపోయి. "మరేం మాట్లాడను ! అన్నట్లు పై ఆదివారం మహేష్ చిన్న పార్టీ ఇస్తున్నాడు చెప్పాను కదూ ! గీతకి మూడోనెల. లక్ష్మణ్‌ని వాడె లానో అహ్వానిస్తాడు. సరే నువ్విప్పుడు అతి థిని కాపు ఆహ్వానించటానికి మాలో ఒక సభ్యురాలివి. కనక ప్రొద్దున్నే వచ్చేసి ఏర్పా ట్లలో సాయపడాలనుకో." అంటూ ఆ రోజు ఎంత ఖర్చు పెడ్దామనుకుంటున్నారో, ఎవ రెవరు వస్తారో చెప్తూంటే వింటూండి పోయింది సంధ్య.

రెండ్రోజులు ఉదయ్‌తో కలిసి తిరిగే సరికి ఆమెకో విషయం స్పష్టమైపోయింది. అతన్ని భర్తగా భావించలేకపోతోంది తను ! అసలు లక్ష్మణ్‌ని తప్ప ఇంకెవర్నీ ఆ దృష్టితో చూడలేదు కూడా ! ఈ హోదాలూ, దర్జాలూ కాలక్రమేణా సంపాదించుకోవచ్చు. కానీ మనిషినే దూరం చేసుకుంటే తిరిగి అతన్నెప్పటికీ పొందలేదు. ఆ సంగతి లక్ష్మణ్‌కెలా చెప్పటం ? చెప్పినా ఛడామడా తిడ్తాడే కానీ ఉదయ్‌కి తనని దూరం చేసేటందుకు వొప్పుకోడు. ఛ! ఛ! తొందరపడి ఎలాటి నిర్ణయం తీసుకుంది తను ! తనని తను తిట్టుకుంది. దానికి తోడు పార్టీలో తనని 'కాబోయే శ్రీమతి'గా ఉదయ్ పరిచయం చేస్తాడేమోనన్న భయం కూడా ఆమెని పట్టుకుంది.

కానీ అలాటిదేం జరగలేదు. 'ఆమె భయం తెలిసిపోయిందా' అన్నట్లు ఉదయ్ మామూలుగా 'మిస్ సంధ్య'గానే అందరికీ పరిచయం చేశాడు. సంధ్య తేలిగ్గా ఊపిరి పీల్చుకుని గీత ప్రక్కనే నిల్చుని చుట్టూ చూసింది.

దూరంగా ఓ అందమైన అమ్మాయితో మాట్లాడుతున్నాడు లక్ష్మణ్,వచ్చినప్పట్నుండీ. ఆ అమ్మాయి అతన్ని అంటిపెట్టుకుని తిర గటం సంధ్య గమనించకపోలేదు. ఆమె ఏం మాట్లాడుతోందోగానీ లక్ష్మణ్ నిమిష నిమి షానికి అందంగా నవ్వుతున్నాడు. సంధ్య కెందుకో ఈర్ష్యగా అనిపించింది. తనూ వెళ్ళి వాళ్ళతో మాట్లాడి ఆమెతో పరిచయం చేసుకుందామనుకునే సరికి చాలా మంది అమ్మాయిలు వాళ్ళ చుట్టూ చేరారు. అంత మంది మధ్య చనువుగా మసలే చొరవలేదు సంధ్యకి. అందుకే నిట్టూర్చి ఊరుకుంది.

పార్టీ ఆనందంగా ముగిసిపోయింది. రెండ్రోజులు గడిచిపోయాక ఒకరోజు సాయంత్రం కార్లో వెళ్తున్నప్పుడు ఉదయ్ అన్నాడు.

"సంధ్యా ! లక్ష్మణ్ తన పెళ్ళి విషయం నీతో ఏమైనా చెప్పాడా ?"

సంధ్య బిత్తరపోయింది. "బావ పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడా ?"

ఉదయ్ నవ్వాడు. "అతననుకోవటం ఎలా ఉన్నా అతను పెళ్ళి చేసుకోవాలని నాకుంది. నిజానికి లక్ష్మణ్‌కి ఇలాటి పార్టీల్లో పాల్గొనటానికి మొహమాటమైనా మొన్న అదేపనిగా ఎందుకు పిలిపించానో తెలుసా ! ఆ రోజు చూసే ఉంటావు ఓ అమ్మాయి అదేపనిగా చాలాసేపు లక్ష్మణ్‌తో మాట్లాడటం."

"అవును. పేరు సునందట కదూ !" పాలిపోయిన ముఖంతో అన్నది.

"ఆఁ! సునంద ! ఆ అమ్మాయి మా దూరపు బంధువే. చాలా మంచమ్మాయి. ఆమెకీ మధ్యే పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు."

"అయితే" సంధ్య కనుపాపలు భయం భయంగా అటూ ఇటూ కదిలాయి. ఆమె గురించి అడిగితే కాలేజీలో తన క్లాస్‌మేట్ అని చెప్పాడు లక్ష్మణ్ ఆ రోజు.

"మన లక్ష్మణ్ వరుడైతే చాలా బాగుంటుందనిపించింది నాకు.

ఆమెకీ, లక్ష్మణ్‌కీ ఇద్దరికీ ఒకరికి తెలీకుండా ఒకరికి ముందే ఆ విషయం చెప్పి ఇంట్రడ్యూస్ చేశాను. లక్ష్మణ్ ఆమెకి చాలా నచ్చాడట. లక్ష్మణ్ కూడా 'చాలా చలాకీ అయిన పిల్ల. ఆమెతో కూర్చుంటే గంటలు నిమిషాల్లా గడిచిపోతాయి. నాకు నచ్చింది.' అని మెచ్చుకున్నాడు. సునందా వాళ్ళది ఈ ఊరు కాదు. ఊరికే చుట్టపు చూపుగా వచ్చారంతే. ఎల్లుండి వెళ్ళిపోతారు. అందుకే ఆమె తల్లితండ్రులు లక్ష్మణ్‌తో ఓసారి మాట్లాడి అతని అభిప్రాయం తెలుసుకోవాలని ఇవాళ మీ ఇంటికి వస్తామన్నారు. బహుశా ఈ పాటికే వచ్చి ఉండవచ్చు." అంటున్న ఉదయ్ సంధ్యవంక చూసి బిత్తరపోయాడు. వెక్కిళ్ళు మీదుగా కన్నీళ్ళు జారిపోతూండగా "ఉదయ్! ప్లీజ్! కారు ఇంటికి మళ్ళించండి...ప్లీజ్!" వెక్కిళ్ళ మధ్య అన్నది.

"సంధ్యా ! ఏమయింది ?" ఉదయ్ కంగారు ధ్వనింపచేస్తూ అన్నాడు.

"ప్లీజ్ ! త్వరగా వెనక్కి తిప్పండి... లక్ష్మణ్ ఓసారి మాటిస్తే తప్పే మనిషి కాదు. అతను ఒప్పేసుకుంటే..."

"ఒప్పుకుంటే మంచిదేగా సంధ్యా? !" ఉదయ్ అర్థం కానట్టు అడిగాడు.

"ఊహుఁ! నాకు మంచిది కాదు...ఇప్పుడు వివరంగా నేను మీకేం చెప్పలేను...."

సంధ్య మాటలు రాను రాను అస్పష్టంగా అవుతూండటం గమనించిన ఉదయ్ ఇక ఆమెని మాట్లాడించే ప్రయత్నమేమీ చెయ్యకుండా మౌనంగా కారు రివర్స్ చేశాడు.

ఇంటి దగ్గర ఆగీ ఆగగానే డోర్ తెరుచుకుని లోపలికి పరిగెత్తింది సంధ్య. చుట్టుపక్కలవాళ్ళు వింతగా చూస్తున్నారనే ధ్యాస కూడా లేకుండా.

లోపల ఏదో ఆలోచిస్తూ పచార్లు చేస్తున్న లక్ష్మణ్ ఆమె నా స్థితిలో చూసి బిత్తరపోయి ఏదో అనబోయేలోగానే సంధ్య అతని మీద వాలిపోయి భోరున ఏడ్చేంది.

"సంధ్యా! ఏమిటిది? ఏమయింది?" అంటున్న అతని ప్రశ్నకి బదులు చెప్పకుండా కంగారుగా చుట్టూ చూస్తూ,

"వాళ్ళు.. వాళ్ళొచ్చేసారా?" అన్నది.

"ఎవరు?" అయోమయంగా చూసాడు లక్ష్మణ్.

"అదే సునందా వాళ్ళ నాన్నగారూ, అమ్మగారూ!"

"వాళ్ళు నా దగ్గరి కెందు కొస్తారు సంధ్యా! నాకు నువ్వనే దేమిటో తలా తోకా అర్థం కావటంలేదు" అన్నాడు లక్ష్మణ్.

"అంటే వాళ్ళు రాలేదా. హమ్మయ్య. అంతే చాలు." సంధ్య ఎంతో బాధ అనుభవించిన తరవాత కలిగిన ఆ ఆనందానికి తట్టుకోలేనట్టు సొమ్మసిల్లి పడిపోయింది. లక్ష్మణ్ గాభరాగా ఆమెను పడుకోబెట్టేంతలో ఉదయ్ లోపలికొచ్చాడు.

"ఉదయ్! ఏమిటిదంతా! నా కంతా అగమ్య గోచరంగా ఉంది. సంధ్య పడిపోయింది. త్వరగా చూడు" లక్ష్మణ్ బరువుగా అన్నాడు. ఉదయ్ సంధ్య దగ్గరికి వెళ్ళి పరిశీలించి చూసి మళ్ళీ లక్ష్మణవైపు తిరుగుతూ, "ఏం ఫరవాలేదు. కాస్సేపట్లో ఆమెకే తెలివి వస్తుంది. ఈలోగా నేను నీకో విషయం చెప్పాలి. పద!" అంటూ ముందు వైపుకి తీసుకెళ్ళాడు. అయోమయంగా అతన్ని అనుసరించాడు లక్ష్మణ్.

ఉదయ్ పాంట్ జేబులోనుండి సిగరెట్ పాకెట్ బయటికి తీసి సిగరెట్ అంటించుకుంటూ, "నువ్వెన్నో సార్లు మా తమ్ముడి పెళ్ళయిపోయినా నేను పెళ్ళి చేసుకోక పోవటానికి కారణం అడిగావు గుర్తుందా లక్ష్మణ్! ఇప్పుడు నీ ప్రశ్నకి జవాబు చెప్తా

న్నాను. నేనొక అమ్మాయిని ప్రేమించాను. సంధ్య లాగే అందమైనది. అమాయకురాలు కూడా!'' అతని మాటలు పూర్తి కాకముందే

''ముందు సంధ్య గురించి చెప్పు ఉదయ్! సునందావాళ్ల తల్లితండ్రులు నా దగ్గరికి రావటమేమిటి? వస్తేమటుకూ సంధ్య ఎందుకంత కంగారుపడాలి?'' అడిగాడు లక్ష్మణ్.

''అదా?! సునందతో పెళ్లికి నువ్వొప్పుకున్నావనీ, ఆమె తల్లి తండ్రులు నీతో మాట్లాడటానికి వస్తారనీ చెప్పా నామెతో.''

లక్ష్మణ్ ఉలిక్కిపడ్డట్లు చూసి,''ఎందుకలా అబద్ధం చెప్పావు?'' అన్నాడు. ఉదయ్ నవ్వి.

''అదే చెప్తున్నాను. నాకు తెలుసు సంధ్యని నువ్వు ప్రేమించావనీ, పెళ్ళి చేసుకోవాలనుకున్నావనీ. కానీ సంధ్య దృష్టి ఎంత సేపూ డబ్బు మీదా అంతస్తు మీదా ఉందనీ! అందుకే ఆమెని నాకిచ్చి పెళ్ళి చేయాలనుకుంటున్నావనీ నువ్వు చెప్పినప్పుడు విస్తుపోయాను. సంధ్య కోరికలకి కాదు. అరవింద గుర్తొచ్చి. అరవిందని నేను ప్రేమించాను. మామూలుగా కాదు అతిగాఢంగా. ఆమె కూడా వ్యక్తిగా నన్నూ, నా సౌశీల్యాన్నీ ప్రేమించింది. కానీ అప్పట్లో ఆమె కోరుకునే ఆడంబరాలూ, అంతస్తూ నాకు లేవని నన్ను త్రుణీకరించి మరో వ్యక్తిని చేసుకుంది. అప్పట్లో నేను

## ఆమెకేం కావాలి?

ఇంకా ఉద్యోగంలో ప్రవేశించని డాక్టర్‌ని ప్రైవేట్ ప్రాక్టీస్ పెట్టుకునేంత శ్రీమంతులం కాము మేము. గవర్నమెంట్ జాబ్ కూడా దొరకలేదు. ఇవన్నీ చూసే నన్ను కాదనుకుని పెద్ద బిజినెస్ మాన్‌ని చేసుకుంది అరవింద. కానీ చేసుకుని సుఖపడ్డదేంలేదు. పెళ్ళి చేసుకోవటంమంత సులభం కాదు ప్రేమించిన వ్యక్తిని మర్చిపోవటం! ఇప్పటికీ ఆమె తన తొందరపాటుకీ బాధ పడ్తూనే ఉంటుందప్పుడప్పుడూ. నేను సరేసరి! అసలు పెళ్ళే చేసుకోలేకపోయాను. సరే! మధ్యలో మామామయ్యగారు పోవటం, ఆయన ఆస్తి మాకు రావటం జరిగింది. ఆ డబ్బుతోనే నేను ప్రాక్టీస్ పెట్టాను.బాగా కలిసి వచ్చి వేలకి వేలు సంపాదించాను.ఆ తరవాతే నీతో స్నేహం ఏర్పడింది. నీ నిరాడంబరతా, మంచితనం వచ్చి నీతో స్నేహం పెంపొందించుకున్నాను. చిత్రంగా సంధ్య మనస్తత్వం కూడా అరవిందలాటిదే నని తెలిసాక కావాలనే ఆమెతో పెళ్లికొప్పుకున్నాను. సంధ్యలాటి అమ్మాయిలు తమకంటే పై అంతస్థు వాళ్లని కోరుకోటం ఎందుకంటే వాళ్లు తమకి అందుబాటులో ఉండరు కనక. అదొక విపమైన క్రేజ్. అంతే. కాని నిజంగా అవన్నీ అందుబాటులోకి వస్తే కానీ తమకి కావలసిందేమిటో తెలుసుకోలేరు. సంధ్య ఎన్ని కలలు ఎంత గొప్పగా కన్నా వాటిలో నాయకుడివి నువ్వే. నిన్ను గొప్ప వాడిగా ఊహించుకుందేగానీ మరో ధనవంతుడి ప్రక్కన తనని ఊహించుకోలేదు. కానీ అది తెలుసుకోటానికి ఆమె కింత కాలం పట్టింది. అయినా ఆమె నీతో ఆ విషయం చెప్పటానికి సాహసించలేక పోతూండటంతో ఈసునందతో నీ వివాహాన్ని త్రింపవలసి వచ్చింది. నే నామెతో చనువుగా మాట్లాడినా, ఒంటరిగా తిరిగినా ఇందుకోసమే! నన్ను అపార్థం చేసుకోవుగా'' అన్నాడు లక్ష్మణ్ చేతిని తన చేతిలోనికి తీసుకుంటూ.

లక్ష్మణ్ హృదయం ఆర్ద్రమైపోయింది. ''ఉదయ్ నీ కెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీటం లేదు'' అన్నాడు.

''కృతజ్ఞతలు చెప్పుకోనవసరం లేదు. సంధ్యని పెళ్లి చేసుకో చాలు''

లక్ష్మణ్ కెందుకో గర్వంగా అనిపించింది. ''ఇంత మంచి స్నేహితుడు ఒక్కడుంటేచాలు. ఇంకెవరూ అక్కర్లేదు. 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ' అన్నారందుకే.

''ఉదయ్ నువ్విలా ఉండటానికి వీల్లేదు. నువ్వూ పెళ్ళి చేసుకోవాలి.'' లక్ష్మణ్ ప్రేమగా అన్నాడు.

ఉదయ్ నవ్వి, "ఉహూఁ! ఇప్పుడు కాదు. ఎప్పుడో చేసుకోవాలనిపించినప్పుడు అలాగే చేసుకుంటాను. మొట్ట మొదట నీకే ఇన్విటేషన్ ఇస్తాను. సరేనా!" అంటూ బూట్లు టకటక లాడిస్తూ బయటికి వెళ్ళిపోయాడు.

లక్ష్మణ్ లోపలికి వచ్చాడు నిట్టూరుస్తూ. అప్పటికే సంధ్య లేచి టేబిల్ ముందు కూర్చుని ఏదో వ్రాస్తోంది.

"సంధ్యా ఏం చేస్తున్నావు? ఎప్పుడు లేచావు?" అంటూ దగ్గరిగా వెళ్ళాడు.

సంధ్య చటుక్కున తలెత్తి వ్రాస్తున్న కాగితం అతని చేతిలో పెట్టేసి బల్లమీద మోచేతుల మధ్య తలదాచుకుంది.

లక్ష్మణ్ అర్థం కానట్లు చూసి చదువుకోసాగాడు.

"బావా!"

నాలో సుళ్ళు తిరుగుతున్న భావాలు నీతో ముఖాముఖీ చెప్పే శక్తి నాకులేదు. అందుకే ఈ పత్రం వ్రాస్తున్నాను. నాన్నగారన్నది అక్షరాలా నిజం. నాకేం కావాలో ఇప్పుడు స్పష్టంగా తెలిసింది. నువ్వే నాకు కావాలి. అహాఁ! కాదు. నువ్వు తప్ప నాకింకెవరూ వద్దు. నన్ను మన్నించి పెళ్ళి చేసుకోదలుచుకుంటే వెంటనే 'నువ్వూ నాకు కావాలి' అనేసెయ్. నీ కష్ట సుఖాల్లో పాలుపంచుకునే జీవిత సహచరిణిగా ఉంటాను. లేదా నేన క్కర్లేదనుకుంటే ఆత్మహత్య ఏ విధంగా చేసుకుంటే సులభమా అని ఆలోచించుకుంటాను—సంధ్య"

లక్ష్మణ్‌కి నవ్వు వచ్చింది. కాగితం మడిచి జేబులో పెట్టుకుని ఆమె భుజాలు కుదుపుతూ, "సంధ్యా! ఇలా చూడు!" అన్నాడు.

"ఉహూ! చూడను. నీ నిర్ణయం చెప్పేదాకా!"

లక్ష్మణ్ మరోసారి నవ్వుకుని, "సరే చెప్తున్నాను. నాకు నువ్వేకావాలి" అన్నాడు.

సంధ్య ఒక్క ఉదుటున లేచి అతన్ని పెనవేసుకుపోయింది. "నాకూ నువ్వు కావాలి." అన్నది ఉద్వేగంగా. లక్ష్మణ్ ఆమెని హృదయానికి హత్తుకున్నాడు.

ఆమె తలమీదుగా చూస్తే ఎదురుగా గోడకి తగిలించి ఉన్న ఫొటోలో నుండి గోపాలరావుగారు 'నాకు మీ ఇద్దరూ ఇలా ఉండటమే కావాలి' అన్నట్లు అనిపించి తృప్తిగా నిట్టూర్చాడు లక్ష్మణ్. ❁

(అయిపోయింది)

**డి.బి.ఆర్. మామిడిపల్లి.**

మనిషిని జీవింప చేసేది ఆశ అంటాను.

నిజమే— ఆశే— యీ జగతిని ప్రగతివైపు ప్రయాణింప చేస్తుంది. . అదే లేక పోతే ఏమీ వుండదు.

**కె.ఎమ్.డి. భీమవరం.**

వ్యభిచార నేరం కింద నలుగురు స్త్రీలకు ఆరు వారాలు కారాగార శిక్ష విధించారని— వార్త. ఈ నేరానికి పూర్తిగా కారకులు స్త్రీలనే గదా న్యాయస్థానం తీర్పు. . .

అంతే — చట్టం సవరింపులు న్యాయంగా రూపొంది అమలులోకి రానంత కాలం — నీతి యిలా కుంటి నడక నడుస్తుంది. వ్యభిచార నిషేధనా చట్టంలో మార్పులు చేర్పులు చేశారు. ఈ నేరానికి పురుషుణ్ని కూడ శిక్షార్హుడుగా చేశారని. కాని నీతి మనిషికి వుండాలి చట్టం ఎంతకాలం వీళ్లని మంచి వాళ్లగా వుంచకలదు. నిజానికి ఆడది దొరికి పోయినట్లు యిలాంటి సందర్భాలలో మగ వాళ్లు దొరకరు. తప్పించుకు పోతారు. దొంగ పేర్లు దొంగ అడ్రసులు యిస్తారు. వారికి చేదోడు వాదోడుగా— వుండి ఆడదాని శరీరంతో వ్యాపారం చేసుకునే వందలాది లాడ్జీలు— ఆంధ్ర అంతటా కుక్కగొడుగుల్లాగా వున్న సంగతి— అందరికీ తెలిసిన నిజం. ఎవరూ పట్టించుకోని స్థితి!

**ఆర్.ఆర్. కొత్తగూడెం.**

ఆడదానికి ప్రతిదాంట్లో ప్రిఫరెన్సు ఇస్తుంటారు. ఎందుకు ? నాకు అధికారం వుంటే ఎన్నటికీ ఆడదానికి ప్రిఫరెన్సు ఇవ్వను.

బ్రతికిపోయాం మీకు అధికారం లేక పోవడం మీ మొగవాళ్ల పరువు కాపాడింది ! ఆడదానికి ప్రిఫరెన్సు ఇవ్వడం— బలహీనురాలని కాదు. చేతకానిదని కాదు— సాటి మనిషిమీద మీ ఉనికికే కారణం అయిన వ్యక్తి మీదా వుండే గౌరవం చాటడం అంతే. సున్నితమైన స్త్రీకి రక్షణగా వుండాలనుకోవడం, ఆమెని గౌరవంగా చూడాలనుకోవడం,...సభ్యతలో మొదటి పాఠాలు సంస్కారానికి తొలి చిహ్నాలు. అవి ఇష్టం లేకపోతే పాటించరని అంటే మీ ఆటవికతే బయటపడుతుంది గాని ఇంకేం ప్రమాదంలేదు.

**వి.పి.ఆర్. కడిచెర్ల, కర్నాటక.**

మనిషి మనిషిగా జీవించగడం ఎలాగ ?

సాటి మనిషిని మనిషిగా చూడ్డం కూడ ఒక దారి. అలాగే ఎదుటి వాళ్లని అంచనా కట్టేటప్పుడు వాళ్లూ మనని అంచనా కట్టారని మరిచిపోకూడదు.

**వై. ఆర్. సిహెచ్. కాకినాడ.**

ఆడది అణిగి మణిగి పడివుండకపోతే మగవాడికి నరకం.

అంతే మరి ! ... బానిసల్ని కోరుకునే వారికి కోస్త నరకం తప్పదు కద.

# వారఫలం

మహేష్

**24-12-1976 శుక్రవారం మొదలు**
**30-12-1976 గురువారం వరకు**

**మేషం :-** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వ్యతిరేకమైన వార్తలను వింటారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు— పుణ్య కార్యాలు చేస్తారు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**మిధునం: —** మీ కార్యక్రమాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :-** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రులు సహాయం చేస్తారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలలో బాధ్యతాభారం పెరుగుతుంది. విలాస వస్తువు కొంటారు.

**సింహం :-** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాలలో నష్టం వస్తుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య :-** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు అందగలదు. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం జరుగుతుంది.

**తుల :-** వృత్తిలో ఆదాయం బాగుంటుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాలో చికాకులు ఏర్పడతాయి. ఇతరుల నిమి

కార్టూన్‌లు పంపేవారు స్వంత చిరునామా గల స్టాంపులతికించిన కవరుకూడా పంపడం మంచిది. సం.

**గ్రంథస్వీకారం : గమనిక**

స్థలాభావంచేత గ్రంథ స్వీకారం మాత్రమే ఆంధ్ర పత్రిక వారపత్రికలో అప్పుడప్పుడు వేయగలుగుతున్నాము. పుస్తకాల శీర్షిక క్రింద సుదీర్ఘమైన సమీక్షలు సాధ్యం కావు. గ్రంధస్వీకారం శీర్షికకి పంపేవారు రెండు ప్రతులు పంపవలసి వుంటుంది. దీనికి సంబంధించి ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా సాధ్యంకానివని అని మనవి. —సం.





త్రం శ్రమకు గురి కాగలరు. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం :–** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతిలభిస్తుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. స్త్రీలకు—సాటివారిలో గౌరవం లభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :–** వృత్తిలో అనుకూల వార్తలు వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మోసపోవటాలుతగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది.బంధువులకు సహాయం చేస్తారు.

**మకరం :–** ప్రయోజనకరమైన సంభాషణలు జరుపగలరు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. విజ్ఞుల సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుటాయి. సంతోషకరమైన సమాచారం అందుతుంది.

**కుంభం :–** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు అందగలదు. విద్యావైజ్ఞానికరంగాలో ఖ్యాతి లభిస్తుంది. బిడ్డల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు—ఆరోగ్యంబాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం :–** మీ తాలూకు వస్తువులు పోవచ్చును ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారంమధ్యలో అనుకూల పరిస్థితి ఏర్పడగలదు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లోపాల్గొంటారు.★

# స్కోరెంత?-3

గవర్నమెంటు ఆసుపత్రి గేటు లేదా—గవర్నమెంట్ ఆరోగ్య భీమా ఆసుపత్రి గేటు అక్కడ నిలబడి చూడాలి. అవతలి డాక్టర్ యివతలి డాక్టర్ని అడుగుతూంటాడు. "ఏం డాక్టర్! ఎన్ని చీట్లు లాగించారు?"

"ఏదండీ! మధ్య టీ త్రాగటానికి లేచానుగాని లేకపోతే ముప్ఫయి చీట్లు లాగించేసే వాణ్ని (డాన్ని)" అని జవాబు

"లాగేసేయండి! వెదర్ ఛేంజ్. అన్నీ కోల్డ్ కేసులే...లేదా యిటు పంపండో డజన్ చీట్లు"- చీట్లు అంటే ఔట్ పేషంట్ అన్నమాట.. అవుట్ పేషంట్లు చీటీ డాక్టర్కి చూపించడం . వున్న బాధలన్నీ ఏకరువు పెట్టడం డాక్టర్గారు తన యిన్-ట్యూషన్ వుపయోగించి చీటీమీద ఎ.పి.సి., పెన్సిలిన్, టెట్రాసిన్, సల్ఫాడయజన్ లాంటి స్టాక్ అవైలబిలిటీ వున్న 'స్టఫ్'ని రాసేసి సంతకం చీటీ చిరిగేలా పెట్టేయడం. "కేసు"ను తిరుపతి దేవాలయంలో పూజారి భక్తుణ్ని "పొమ్మన్న" తీరులో బయటికి త్రోసేయడం... 'స్కోరెంత?' అంటే అక్కడి అర్థం అది- "చీట్లు" ఎన్ని అని... [సంచారి]



జీవితంలో వారికిది
అత్యంతానందకరమైన రోజు.
వారికి సుఖసంతోషాలు, ఐశ్వర్యాలు
కలగాలని కాంక్షిస్తూ
ఆశ్చర్యకరంగ లాభం చేకూర్చే
ఒక కానుకతో అభినందించవచ్చు
స్టేట్ బ్యాంక్ గిఫ్ట్ చెక్

దీనిలో మరో విశేషం.
మీరు వారికిచ్చే కానుక ద్వారా మీకూ ఓ కానుక గెలుపొందే అవకాశం!

లక్కీ డ్రాలో, రూ. 11/- విలువ చేసే స్టేట్ బ్యాంక్ గిఫ్ట్ చెక్ ద్వారా వారు రూ. 400/-, మీరు రూ.100/- గెలుపొందే సదవకాశం. అలాగే రూ. 25/- విలువ చేసే చెక్ ద్వారా పైన చెప్పిన దానికన్న రెండింతల సొమ్ము, రూ. 51/- విలువ చేసే చెక్ ద్వారా నాలుగింతల సొమ్ము గెలుపొందవచ్చు.

ఇది సందర్భానికి సముచితమైన కానుక కాదూ మరి? వారికి సుఖసంతోషాలు, ఐశ్వర్యాలు కలగాలని అభినందించేందుకు స్టేట్ బ్యాంక్ గిఫ్ట్ చెక్కు మించినది మరేది ఉంటుంది?






స్టేట్ బ్యాంక్

CHAITRA-SBI-128 TEL



న్యూజిలాండ్ జట్టుతో జరిగిన క్రికెట్ పోటీలకు నాయకత్వం వహించి, రెంటిని గెల్చిన కప్తాను బిషేన్‌సింగ్ బేడీ ఎం. సి. సి. తో జరిగే ఐదు టెస్టులకు కూడా నాయకత్వం వహిస్తాడు... "వాన రాకపోతే చెప్పలేంగాని, వానవస్తే మన స్పిన్నర్లదే పై చేయి" అంటారు కొందరు పరిశీలకులు.

---

"ఆరంభ సదృశోదయః" అన్న కాళిదాస వచనాన్ని ముమ్మూర్తులా తీసినవారు శ్రీ శర్మగారు. [illegible] తెలుపుతుండగా, పులకించిన పలుకుబడి మాటలు వినడానికి మనసును చూపుతుండగా [illegible] మిస్తారు శర్మగారు. ఈయుగంలో తెలుగు సాహిత్య విమర్శ ప్రస్థానానికి ప్రవర్తకులు శర్మగారని విశ్వసించేవారిలో నేనొకణ్ని. సహస్ర చంద్ర దర్శనం కొన్నేళ్ల క్రితమే చేసుకొని సహస్రాధిక సహృదయాలను సద్విమర్శ ప్రవణం చేసిన శర్మగారికి ఆంధ్రావళి ఎంతో ఋణపడి ఉంది. అలాంటి శర్మగారిని మైసూరాంధ్రులు పెద్ద ఎత్తున సన్మానించ దలచడం, ఆ మహోత్సవం సంక్రాంతికి జరుగనుండడం ఆ పెద్ద పండుగను మరింత పెద్దగ చేసింది. సన్మాన సన్నాహం వివరాలు డాక్టర్ రాళ్ళపల్లి సుందరం, శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ మొదలయిన నిర్వాహకులనుంచి తెలుసుకొన్న ఎస

# ధర్మపథం —బులుసు వేంకటరమణయ్య.

## చెడ్డ కలలు రాకుండా—

మానవులకు అనేకవిధాలైన అవస్థలుంటాయి. జాగ్రదవస్థ—సుషుప్తి—స్వప్నం అనేవి అవస్థాత్రయంగా ప్రసిద్ధాలు. మెలకువగా ఉండడం జాగ్రదవస్థ. గాఢ నిద్రాస్థితి సుషుప్తి. కలతనిద్ర స్వప్నావస్థ. కలతనిద్రలోనే కలలు వస్తూ ఉంటాయి. నిదపోవడానికి ముందు ఏవి తలచుకుంటున్నా, వేటిని చూచినా స్వప్నావస్థలో కలలో అవి చోటు చేసుకుంటూ ఉంటాయి.

చెడ్డకలలు వస్తే ఎంతో భయం వేస్తుంది. దానివల్ల బలహీనతకూడా ఏర్పడుతుంది. అందువల్ల నిద్రపోవుటకు ముందు మంచివాటిని స్మరించుకోవడం మేలు. ఈ విషయంలో పెద్దలు చెప్పే శ్లోకం యిది—

"రామం స్కందం హనూమంతం
వైనతేయం వృకోదరమ్,
శయనే యః పఠేన్నిత్యం
దుస్స్వప్నం తస్య నశ్యతి."

పడుకోబోయేముందు ప్రతిదినమూ శ్రీరాముణ్ని, కుమారస్వామిని, హనుమంతుణ్ని, గరుత్మంతుణ్ని, భీముణ్ని తలుచుకోవాలి. అలా తలుచుకుంటే చెడ్డ కలలు రావు అని దీని అభిప్రాయం. పడుకున్నేటప్పుడు దీన్ని చదువుతూ పయివారిని స్మరించడం సంప్రదాయం.

అయితే పయివారినే ఎందుకు స్మరించాలి? అనే సందేహం కలుగకపోదు. దానికి సమాధానము లేక పోలేదు.

పయివా రందరూ మహాబలవంతులు. ధర్మపరాయణులు. అట్టివీరిని తలచుకుంటే మనకు మరేమీ భయం లేదు. 'చెడుకలలు రావు' అనే ధీమాతో నిద్రపోవచ్చును.

శ్రీరాముడు జగదేకవీరుడని అందరికీ తెలుసును. అతని పితృవాక్యపరిపాలన ఎట్టిదో ఎరుగనివారూ ఉండరు.

కుమారస్వామి పుట్టి దేవసేనాధిపతిత్వం స్వీకరిస్తేనేకాని దేవతలకు తారకాసురుడివల్ల కలిగే బాధలు తప్పలేదు. గణాధిపత్యం గణపతి వహించడంలోనే ఇతని ధర్మపరాయణత వ్యక్తమవుతున్నది.

తలిస్తే హనుమంతుడు ఒక్కడే చాలును రాక్షసుల నందర్నీ చంపి సీతాదేవిని తీసుకొని వెళ్ళడానికి. చూచి రమ్మన్న మాట నిలపడమే చాలు, అతని నీతి నియమాలకు.

దేవతలు ఎంతో భద్రంగా కాపాడుతున్న అమృతభాండాన్ని సంపాదించడంలోనే గరుడుని బలం తెలుస్తున్నది. తల్లి దాస్యంకారణంగా చచ్చు పాములను మోస్తూ ఉండిన అతని నియమ పాలన ఎటువంటిదో ఊహించవచ్చును.

ఇక భీముడి సంగతా? బక, హిడింబాది రాక్షసరాజుల్నే అవలీలగా హతమార్చిన అతని బలం ఎటువంటిదో అందరూ గ్రహించగలరు. అన్నమాటలకు లొంగి ఉండకపోతే కౌరవులు ఎప్పుడో చచ్చి వుండేవారు. భారతయుద్ధం అవసరమే లేకపోయేది.

---

లైనా సంతోషిస్తారు, వారిని అభినందిస్తారు.

### శ్రీమతి ప్రభా రసోనీ చిత్రాలు

లాహోర్‌లో జన్మించి, పంజాబ్ విశ్వవిద్యాలయంలో లలిత కళలు అభ్యసించి, తర్వాత ఢిల్లీలో లలిత కళోపాధ్యాయినిగా ఉండి, పెక్కుమంది శిష్యులను [illegible] విజేతలుగా తీర్చిదిద్ది, ఢిల్లీ ఇతర చోట్ల పెక్కుచోట్ల ప్రదర్శనలు జరిపి, పెక్కు చిత్రాలను ప్రభుత్వం కొనుక్కొన్న రచించిన శ్రీమతి ప్రభారసోనీ నవంబర్ మొదటివారంలో కళాభవన్‌లో వర్ణ చిత్రాలు ప్రదర్శించారు. వర్ణ సమ్మేళనంలోను, వాస్తవికతా చిత్రణలోను, కుంచె పనితనంలోను ఈమె పెద్ద హస్తలాఘవం [illegible] 1975 జూన్ 25 ఎమర్జెన్సీ, జీవిత చక్రం, పునస్సృష్టి సూర్యాస్తమయం, [illegible] ఉన్న [illegible] యాలు ఎన్నో చిత్రాలు ఉన్నాయి.

### పత్రికా శిరోమణి :

తొలి హిందీవారపత్రిక 1826లో కలకత్తా నుండి వెలువడింది. ఇప్పటికి 150 సంవత్సరాలు గడిచాయి. ఆ సార్థ శతాబ్ది సంపూర్తికి ఉపలక్ష్యంగా కలకత్తాలోని పశ్చిమ బెంగాల్ హిందీ ప్రచార సభవారు నవంబర్ 25,26,27 లలో ఉన్న హైస్కూలు హాలులో జరిపిన మహాసభలో 150 మంది ప్రముఖ సర్వభాషా పత్రికా రచయితలకు "పత్రికా శిరోమణి" అనే బిరుదు ఇచ్చారు. ఈ మహాసభకు హాజరు కానివారికి [illegible] అందజేస్తారు. మహాసభలో హైదరాబాదు నుంచి 14మంది పాల్గొన్నారు. వీరిలో 11మంది

## హైదరాబాద్ నోట్‌బుక్

పత్రికా శిరోమణి ఉపాధి లభించింది. ఉపాధి పొందిన వారు శ్రీయుతులు తిరుమల రామచంద్ర, జి.ఎస్. వరదాచార్యులు, (ఆంధ్ర భూమి), కాటం లక్ష్మీ నారాయణ (తెలుగుభూమి) వెంకటనాద్ ఓర్షా (నవభారత్ టైమ్స్) వారణాసి రామమూర్తి రేణు (ఆకాశవాణి), జవహర్ జె.పి. (దక్కన్ క్రానికల్), హర్‌నామ్ సింగ్ ప్రవాసీ (మిలాప్) ఓం ప్రకాష్ నిర్మల్ (కల్పనా) సి.యం. ఖాన్, హాఫీజుఖాన్ (రహనుమాయి ఆంధ్రప్రదేశ్). సత్య నారయణశర్మ (హిందూస్తాన్ సమాచార్).

ఉపశ్రుతి :

"పత్రికా శిరోమణిబిరుదు నాగమణి, భాలామణి అనే ఆడపేర్లలాగే వుంటుంది" అన్నారు నిజాం కాలేజి ఉర్దూ శాఖాధ్యక్ష డాక్టర్ జీనత్‌సాజిదా "పద్మశ్రీ కూడా అలాగే లేదూ" అన్నాను. "అవును యోగ్యత ఎలాగయినా వుండనీ మగవారికి ఇచ్చే బిరుదు లైనా మగతనం తొణికిసలాడుతూ జబర్దస్తుగా వుండవద్దా?" అన్నది జీనత్‌సాజిదా. ఆమె మహా వక్త. మహావ్యంగ్య రచయిత్రి. ఏమి జవాబు చెప్పను. వూరికే వుండి పోయాను.

—తిరుమల రామచంద్ర

## ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

### పాలాక్షుని డైరీ

19.11.76 పత్రిక పాలాక్షుని డైరీలో మూడవ విశేషమయిన "కుడిఎడమైతే పొరపాటె"లో "అరబ్బులు వారి సంప్రదాయం ప్రకారం దేన్నయినా ఎడమనుంచి కుడికి చదువుతారట" అని వ్రాసినారు కాని అది సరికాదు. ఉర్దూ, అరబ్బి భాషల లిపి కుడి నుంచి ఎడమకు చదవవలసి ఉంటుంది. మనం తెలుగు, ఇంగ్లీషు తదితర భాషలను ఎడమనుంచి కుడికి చదువుతాం కదా!

"బిజ" (ధీం)

### మట్టిగోడలు

19.11.76 ఆంధ్రసచిత్ర వారపత్రికలోని మట్టిగోడలు నానిపోకుండాచేసేపద్ధతివ్రాసిన తర్వాత ఈ లేఖ మీకు వ్రాస్తున్నాను. కిరోసిన్ వుపయోగించితే, ఆ ఇంటి గోడలు అగ్నిప్రమాదానికి గురి కావడానికి అవకాశం వుంటుంది గదా!

కె. వి. ఆర్. సుబ్రహ్మణ్యం. (కాకినాడ)

### అంకితం

నేను వ్రాసిన "వ్యక్తిత్వంలేని వ్యక్తి" అనే కథ చిన్న సీరియల్‌గా నాలుగు వారాలు ప్రచురించిన మీకు నా హృదయపూర్వక అభినందనలు.

"గత నాల్గు వారాలుగా ప్రచురితమైన "వ్యక్తిత్వం లేని వ్యక్తి" అనేకథ భర్తకు, పిల్లలకు దూరమై అకాలంలోనే కాలగర్భంలో కలసి పోయిన అమ్మకు అంకితం" రచయిత్రి, (విశాఖపట్నం.)

# చక్కని అభిరుచిగలవారికి నిజమైన పొదుపు

రికరి
ఇన్‌స్టెంట్




## టీ స్పూన్‌లో సగంపొడి మాత్రమే వాడండి

(అభిరుచిని అనుసరించి
ఎక్కువ తక్కువ చేసుకోండి)




**50 గ్రాముల సీసాకు**
**37 కప్పుల కాఫీ**

మరే యితర 50 గ్రాముల సీసా ఇచ్చేదానికన్నా 7 కప్పుల కాఫీని ఎక్కువ ఇస్తుంది రికరి. కారణం—రికరి చిక్కదనం. అంతేకాదు: పొదుపు చేసేమార్గం కూడా.



**మరింత చిక్కదనం.**
**మరింత పరిమళం**

ఎక్కువ రుచి. ఘుమాళింపు ఉండేట్టుగా తయారీ. కనుక మంచి చిక్కని. రుచికరమైన కాఫీ ఒక కప్పు కావాలంటే, తక్కువ రికరీ వాడితే చాలు.



ఇప్పుడు మీ రికరీ ధర చాలా తక్కువ!

50 గ్రాముల సీసా ధర 50 పైసలు తగ్గించబడింది — నిజం.

## రికరి ఇన్‌స్టెంట్ దాదాపు డికాక్షన్ కాఫీ ధరకు డికాక్షన్ కాఫీ రుచినిస్తుంది

NRCM-27 75 TEL

# అవీ - ఇవీ - అన్నీ

## రాజా రామమోహనరాయ్

జీవిత చరిత్ర. రచన: శ్రీమతి మోటూరు ఉదయం. 80 పేజీలు. వెల రెండు రూపాయలు. ప్రచురణ: జయంతి పబ్లికేషన్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ 2.

సతీసహగమనాన్ని ఎదిరించి పోరాడి సర్వాన్నీ త్యాగంచేసి మహిళలకి ప్రాణభిక్ష పెట్టిన సంస్కర్త, యుగకర్త రాజారామమోహనరాయ్ జీవిత చరిత్రని సంగ్రహంగా అందరికీ అర్థం అయ్యే విధంగా రచయిత్రి ఈ పుస్తకంలో చిత్రీకరించారు.



## శ్రీ గండి వీరాంజనేయ నక్షత్రమాల

రచన: తత్వవిశారద, మధురకవి, శ్రీ ఎ. వి. నారపరెడ్డి, 16 పేజీలు. వెల : 50 పైసలు. ప్రతులకు : శ్రీ బి. శంభురెడ్డి, టీచర్, శ్రీ సాయీ సమాజము (రిజిస్టర్డ్), వీరపునాయుని పల్లె (పోస్టు) కడప జిల్లా.

## తరం తరం

కొంతమంది ప్రముఖులైన వారివి, కొంతమంది వర్ధమానులవి వచన గేయాలు ఎత్తి తయారుచేసిన ఒక సంపుటం ఇది. ఈ సంపుటంలో వందమంది కవుల కవితలున్నాయి కాని వాటిలో ఏ కవిత క్రింద దాని రచనా కాలం కాని సందర్భం కాని లేవు. శ్రీ కుందుర్తి గౌరవ సంపాదకత్వం క్రింద వేసిన యీ ఫ్రీవర్స్ ఫ్రంట్ హైదరాబాదు వారి యీ కవితా సంకలనం వెల పది రూపాయలు పెట్టడం కొంచెం ఎక్కువే. అంత కన్నా తక్కువ వెలకు సర్వసమగ్రమనదగ్గ సంకలనాన్ని తెస్తే ప్రయత్నం చేస్తారని ఆశించితే తప్పులేదు.

## శ్రీ శంకర విజయగాధ

(మొదటి భాగము)

**ఆ**ది శంకరుల కథను బొమ్మలతో వివరించే ఈ గ్రంథం శ్రీ తేజోమూర్తుల కేశవ రావుగారి చిత్ర లేఖనంతో, శ్రీ గుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి సంచాలనలో శ్రీ బొడ్డపాటి రాజన్నగారి పర్యవేక్షణలో మంచి కాగితం మీద చక్కగా అచ్చువేయబడి వున్నది. బొమ్మలు కథా వ్యాఖ్యానము కూడా బాగున్న యీ పొత్తం వెల 3 రూపాయలు. ప్రతులకు శ్రీ శంకర కృప. 11, హనుమాన్ కోవెల వీధి, మద్రాసు – 600033 కి వ్రాయాలి.

## బస్సు – మిస్సు

ప్రసిద్ధ రచయిత "ఆదివిష్ణు", 'శ్రీ పూసల' కలిసి [illegible] రవాణా సంస్థ వారి క్లబ్ కోసం రాసిన 'బస్సు—మిస్సు' అన్న ప్రయోజనాత్మక నాటికను యీమధ్య విజయవాడలో ఆర్. టి. సి. డివిజనల్ మానేజర్ శ్రీ ఎస్. వెంకటనారాయణ సంబరంగా ఆవిష్కరించారు. డిప్యూటీ మేనేజర్ ఆర్. టి. సి. శ్రీ రావూరు రామారావు యీ నాటికను అంకితం తీసుకున్నారు. సభకు శ్రీ సి. రామమోహనరావు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు వీరాజీ, పురాణం, శంకరమంచి సత్యం ముఖ్య అతిథులుగా పాల్గొన్న నాటిక ప్రదర్శన దర్శకుడు ఆరాజ సూర్యప్రకాశరావు దర్శకత్వంలో [illegible] కట్టింది.

(ఐ. వి.)

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే 'యింధనాన్ని' సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

[illegible]

బూస్ట్‌లో, యితువంటి మరే యితర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పాలు వున్నాయి. బూస్ట్‌లో మరింత ఎక్కువగా పాలు వున్నాయంటే, మీ పిల్లలు పెరగడానికి మరింతగా పోషణ పదార్థాలు, మరింతగా మాంసకృత్తులూ లభిస్తాయన్నమాట. బూస్ట్‌లో ఎక్కువగా పాలు వుండటంవల్ల ఎక్కువగా మీగడగా వుంటుంది. మీకు ఆ రుచి తెలుస్తుంది.

అంతేకాదు, బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా ఎంతో యిష్టపడే మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన వున్నాయి. మీ రోజుని ప్రారంభించేందుకు యిది ఉచితమైన మార్గం—ప్రతి రోజూ.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

ఆంధ్రప్రదేశ్ మరియు కేరళలో మాత్రం లభించును

# 'సినీ హెరాల్డ్' పాఠకులకు సంక్రాంతి శుభావకాశం

తెలుగు ఫిలిం జర్నలిజంలో ప్రామాణికతను, నిష్పాక్షికతను, ఉదాత్తతను అలవాటుచేసి, అనేక పత్రికలకు అగ్రేసరమై నిలిచి కుటుంబంలోని ప్రతివారు చిత్ర పరిశ్రమ విశేషాలను తెలుసుకోడానికి ఇంటింటి పత్రికగా సినీ హెరాల్డ్ బహుళ ప్రజాదరణ పొందుచున్నది. ఆంధ్రప్రదేశ్ మారుమూల గ్రామాలనుంచికూడా 'సినీహెరాల్డ్' ఏజన్సీకోసం పలువురు మాకు ఉత్తరాలు వ్రాస్తున్నారు. అయితే, రైలు, బస్సు సౌకర్యాలు సరిగాలేని గ్రామాలకుగాని స్వల్ప సంఖ్యలో పత్రికలు తెప్పించుకోదలచిన ప్రదేశాలకుగాని మేము నేరుగా ఏజన్సీ ఇచ్చినందువల్ల ఏజంటుకుగాని, మాకుగాని వ్యాపార ప్రయోజనం లేకపోగా వ్యయప్రయాసలు, జాప్యాలు ఎక్కువవుతాయి. ప్రవాసాంధ్రులు విశేషంగా ఉంటున్న సుదూర ప్రాంతాల నుంచి కూడా 'సినీహెరాల్డ్' కోసం అభ్యర్థనలు మాకు చేరుతున్నాయి. అయితే మొత్తం మీద పాఠకులందరికీ సౌకర్యంగా ఉండేట్లు నేరుగా "సినీహెరాల్డ్" చందా దారులుగా చేరే వారందరికీ ఒక ప్రత్యేక పథకాన్ని ప్రవేశపెడుతున్నాం.

## ఆనంద చిత్ర యాత్ర పథకం

"సినీహెరాల్డ్" కార్యాలయానికి నేరుగా సంవత్సర చందా రు.40/- మీరు మనియార్డరు ద్వారా పంపితే వచ్చే జనవరి మూడో వారంలో నిర్వహించే లక్కీడ్రాలో మీ మనియార్డరు కూపన్లన్నీ చేర్చుతాం. ఈ లక్కీ డ్రా ను వినియోగించుకోదలచిన వారు ఈ రోజు నుండి వచ్చే సంక్రాంతి పండుగ అనగా 14-1-1977 తేదీలోగా ఎప్పుడైనా మా కార్యాలయానికి రు. 40/- సంవత్సర చందా మనియార్డరు ద్వారా అందజేయాలి. 16.1.77 ఆదివారంనాడు లక్కీడ్రా తీయబడుతుంది. ఫలితాలను గెలుపొందిన వారికి వెంటనే తెలియజేస్తాం.

## ప్రయోజనాలు

ఈ లక్కీడ్రాలో గెల్చిన 15 మందికి జనవరి ఆఖరులోగా రానుపోను మా ఖర్చులపై ఆహ్వానించి మూడు రోజులు హైదరాబాద్‌లో వారికి ఆతిథ్యం ఇచ్చి నగరంలోని అన్నపూర్ణా స్టూడియో, రామకృష్ణా సినీస్టూడియో, శ్రీ సారధి స్టూడియో, నిర్మాణంలో వున్న భాగ్యనగర్ స్టూడియోలకు తీసుకువెళ్ళి శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, శ్రీ ఎన్. టి. రామారావు మొదలైన మీ అభిమాన కథానాయకులను ఇతర కళాకారులను పరిచయం చేయించడమే కాక నగరంలోని వివిధ దర్శనీయ స్థలాలను కూడా చూపించి పంపుతాం. ఈ లక్కీ డ్రాలో గెలుపొందిన 15 మందిలో ఎవరైనా ఈ ఆనంద చిత్రయాత్రకు ఇష్టంలేని వారుంటే, ఆ విషయం తెలియ బరచినట్లయితే, వారికి ఇందుకు బదులు ఒక H. M. T. వాచి కానుకగా అందజేస్తాం.

ఒక వేళ ఈ డ్రాలో మీరు గెలిచే 15 మందిలో ఒకరు కాకపోయినప్పటికీ మీకు ఎటువంటి నష్టమూ ఉండదు. మీరుకట్టిన చందా విలువకు 1-2-77 నుంచి సంవత్సర కాలమూ మీ యావత్తు కుటుంబమూ చదివి చిత్ర పరిశ్రమ విశేషాలు తెలుసుకోడానికి వీలుగా "సినీహెరాల్డ్" నేరుగా మా కార్యాలయం నుండి మీ ముంగిటికి చేరుతుంటుంది. మధ్యలో అదనపు సందర్భాలకు "సినీహెరాల్డ్" ప్రచురించే ప్రత్యేక సంచికలు కూడా అదనపు ఖర్చు లేకుండా మీకు లభిస్తాయి.

ఈ లక్కీ డ్రాకు ఎటువంటి ప్రవేశరుసుమూ లేదు. మనియార్డరు ద్వారా రు. 40/- లు సంవత్సర చందా నేరుగా మా కార్యాలయానికి కట్టిన ప్రతి వారూ ఈ లక్కీ డ్రాలో పాల్గొంటారు.

ఎడ్రస్ :

**సర్క్యులేషన్ మేనేజర్, సినీ ఓం హెరాల్డ్,**

**పంజాగుట్ట, రాజభవన్‌రోడ్డు, హైదరాబాద్ - 500004 (ఎ.పి)**

**మరువకండి : మీ చందా మొత్తం మాకు 14-1-77 లోగా చేరాలి**

**ఈ సంక్రాంతి శుభావకాశాన్ని వినియోగించుకొని**

**భాగ్యనగరంలో ఆనంద చిత్ర యాత్రకు సంసిద్ధులు కండి !**



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# మా పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం
# మా పైర్లకు అవసరం విజయ్

పిల్లలు ఆరోగ్యంగా వుండాలంటే పుష్టికరమైన ఆహారాన్నివ్వాలి. అట్లాగే పైరు మొక్కలకు నత్రజని, భాస్వరం, పొటాష్‌లతో కూడిన పోషక పదార్థాలు అందజేయాలి. అప్పుడే పంటదిగుబడులు బాగుంటాయి, రాలుబడి ఎక్కువౌతుందికూడా.

ప్రస్తుతం ఎరువుల ధరలు పెరిగిపోయిన మాట వాస్తవమే. అందుచేత ఖర్చులు తగ్గించుకోడానికి వరిపైరుకు యూరియా మాత్రమేవేస్తే సరిపోదాఅని మీలో కొందరు అనుకోవచ్చు. కాని యూరియా మాత్రమే వేస్తే...వరి మొక్కలలో చీడలు, తెగుళ్ళ నిరోధక శక్తి తగ్గిపోతుంది. అంతేకాదు పైరు నీటి ఎద్దడిని తట్టుకునే శక్తినికూడా కోల్పోతుంది. భూసారం కూడా క్రమేణా తగ్గి పంటదిగుబడులు క్షీణించిపోతాయి.

భాస్వరం, పొటాష్‌లు వాడినపుడే మొక్కలు నత్రజనిని గ్రహించుకోగలుగుతాయి. ఈ మూడు పోషక పదార్థాలు వాడితే పైరు మొక్కలు బాగా ఎదిగి, అధికరాలుబడి, అధిక లాభాలు వస్తాయి. ఈ విషయాన్ని ఋజువుచేసిన పరిశోధనా ఫలితాలను పరిశీలించండి.

## వరిపంట

| వేసిన పోషక పదార్థాలు | ఎకరాకు దిగుబడి (75 కిలోల బస్తాలు) | ఎకరాకయ్యే సాగుబడి ఖర్చు రూ. | ఎకరాకు రాబడి రూ. |
|---|---|---|---|
| 50 కిలోల నత్రజని | 20 | 1080 | 1200 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం | 29 | 1255 | 1740 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం + 25 కిలోల పొటాష్ | 32 | 1300 | 1920 |

పై వివరాలనుబట్టి చూస్తే నత్రజనితోపాటు వరి పైరుకు భాస్వరం పొటాష్‌లను కూడా వేయడంవల్ల అదనంగా అయ్యే ఖర్చు ఎకరాకు రూ. 220/-. అయితే దీనివల్లవచ్చే రాబడి ఒక నత్రజనిని మాత్రమేవేస్తే వచ్చిన రాబడికన్నా రూ. 720/- ఎక్కువ. ఇదే విధంగా యితర పైర్లకు కూడా విజయ్ 17-17-17 వాడినట్లయితే అధిక దిగుబడి అధిక లాభాలు పొందవచ్చు. విజయ్ 17-17-17లో నత్రజని, భాస్వరం, పొటాష్ పోషక పదార్థాలు సమపాళ్లలో వున్నాయి.

పొటాష్ ఎక్కువగావున్న భూములకు అనువైన ఎరువు విజయ్ 24-24-0. విజయ్ కాంప్లెక్స్‌లతో బాటు పైరుమీద చల్లడానికి విజయ్ యూరియా చాలా అనువైనది.

విజయ్ ఎరువులను వాడండి—అధిక లాభాలను పొందండి.




వివులంగా తెలుసుకోవాలంటే యీక్రింది చిరునామాకు వ్రాయండి.
ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతినగర్ కాలనీ, హైదరాబాద్-600-028






22792

# ఐటెక్స్
## సౌందర్య సాధనములు




ARAVIND LABORATORIES MADRAS-600 033